# శ్రీ అరవింద జీవితము

ప్రకాశకులు

శ్రీయుత తు. కోదండరామయ్యాగారు, బి. ఏ. బి. ఎల్.

[illegible]

# విషయసూచిక

పుట.



## మొదటి తరంగము ౧ - ౨౦



## రెండవ తరంగము ౨౧ - ౫౦

## మూడవ తరంగము ౫౧ – ౧౦౨



## నాలగవ తరంగము ౧౦౫ – ౧౩౦

## ఐదవ తరంగము ౧౩౧ - ౧౬౪



## ఆఱవతరంగము ౧౬౫ - ౧౯౬



## అ ను బ ం ధ ము ౧౯౯ - ౨౧౫

శ్రీ జీవన [illegible],
[illegible]

# పరిచయవాక్యములు

---

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః.

ఓమ్ తత్ సత్ భావోద్భవ ప్రతిష్ఠమైన బ్రహ్మత్వము సర్వమునకును పరమపురుషార్థము. ప్రణవము, తత్త్వము, సత్త్వము సర్వాధారములైన బ్రహ్మపరిణామములు. బ్రహ్మోద్భవమైన కర్మఫలప్రాప్తికి సత్త్వాధాత్త్వాధారమైన శ్రద్ధ సాధనము. సాపేక్షమైన కర్మ నిరపేక్షమైన బ్రహ్మాశ్రయమునను పూర్ణయోగపరిణామమును పొందుచున్నది. సాపేక్షములైన ధర్మార్థకామములు నిరపేక్షమైన బ్రహ్మానందానుభూతికి నిత్యనైమిత్తికసాధనములు. ధర్మార్థకామములు బ్రహ్మానందానుభూతికి మూలాధారములయినను దుఃఖానుభవమునకు మూలములగుట ప్రకృతివిచిత్రము.

ప్రకృతిసిద్ధమైన సుఖప్రాప్తికిని, దుఃఖనివృత్తికిని జీవము చేయుచున్న కర్మయాత్ర, ధర్మయాత్ర, బ్రహ్మయాత్ర పూర్ణయోగసాధనమునను ఆత్మత్వపరిణామమునకు

వినియోగపడుచున్నవి. కర్మ యజ్ఞార్థమై, అంతర్ముఖమై, ఆత్మార్థమై, భక్తిశ్రద్ధాపరాయణమగుచు పూర్ణయోగ పరిణామమును పొందుచున్నది; కామార్థమై, బాహ్య పరమై, ఇంద్రియార్థమై, విషయాసక్తమై, భ్రష్టయోగ పరిణామమును పొందుచున్నది. సచ్చిదానందాత్మక బ్రహ్మమయమైన బ్రహ్మాండ మజ్ఞాన జడభ్రాంతికి సాధన మైనది. ఆనందమయమైన సంసారము దుఃఖమయమైనది; చైతన్యమయమైన ఆత్మ జడప్రాయమైనది; ఇహము నందు దుర్లభమైన సుఖము పరమునందు సులభమైనది.

కాషాయాంబరములు, ముండనము, సన్న్యాసము, వైరాగ్యము, ప్రజ్ఞావాదము పూర్ణయోగస్థానము నాక్రమించి పురుషార్థమును పరిహాసపాత్రము చేసినవి. సకలార్థములకును యోగసాధనమజ్ఞాతమయి యోగ స్మరణము శరణ్యమైనది. విషాదయోగావృతమైన హృదయమునందు యోగోద్ధరణమును జేయుటకు దీక్షితులైన మహానుభావులు ధన్యాత్ములు.

పూర్వకాలమునందు పురుషార్థమునకు వ్యాస జనక శంకర రామానుజాదులు ప్రతిపాదించిన యోగముల వలెను వర్తమానకాలమునందు శ్రీ అరవిందయోగీంద్రుని పూర్ణయోగము యోగసాధనసాధ్యములైన పర మార్థమునకు సాధనములు. శ్రీ అరవిందుని యోగ

సాధనచరిత్రము సాధకులకు పూర్ణయోగతత్త్వమును గ్రహించుటకు ప్రత్యక్షప్రమాణముగ నున్నది.

శ్రీ అరవిందయోగిజీవితము సనాతనమైన భారతీయ సంస్కార ఫలము. అరవిందయోగియందు వైదిక యుగమునందలి కర్మయోగప్రభావము దర్శనమునందలి జ్ఞానయోగమాహాత్మ్యము భక్తియోగప్రపత్తియందు సమాశ్రయమును పొందినవి. ప్రాచ్యజన్మసంస్కారము పాశ్చాత్యవిద్యాస్నాతకసంస్కారము యోగిహృదయమునందు విశిష్టసంస్కారవిజ్ఞానసంపత్తికి సాధనములైనవి. ఈ పరమార్థమునే వారిజీవితాంశములు విశదము చేయుచున్నవి. పాశ్చాత్యవిజ్ఞానలబ్ధమైన భౌతికకళాశాస్త్ర పరిచయము ప్రాచ్యవిజ్ఞాననిరీక్షణమున కుపయోగపడినది. వంగదేశ విభజనకాలమునం దరవిందుడు చూపినదేశ భక్తి, కార్యదీక్ష పత్రికానిర్వహణసామర్థ్యము త్యాగము వారి నిరుపమానమైన ప్రజ్ఞకు నిదర్శనములు. వారి యోగదర్శనము, భేదాభిప్రాయములకు మూలమైనను, నియతకర్మానుష్ఠానమునకును, దివ్యజీవనమునకును, అధ్యాత్మజీవనమునకును సాధనమైన పూర్ణయోగమునకు సాధనమగుచున్నది. శ్రీఅరవిందునకు యోగాభ్యాసము, స్వదేశదీక్ష, స్వధర్మప్రచారము, పత్రికానిర్వహణము, నిర్బంధానుభవము, ఉద్యోగము, విజ్ఞానో

పార్జనము మొదలగు జీవితాంశములు పూర్ణయోగారూఢమునకు సాధనము లైనవి.

మానవధర్మ పరిణామమునందు మతధర్మములు, రాజ్యాంగములు, సాంఘిక నియమములు, దేశకాల పాత్రావరణములందు ప్రత్యేక ప్రయోజనములకు సాధనములైనను పరస్పరవిరుద్ధములు కావు. మానవధర్మ పరిణామమునకు దేశభక్తి దైవభక్తి, భోగము త్యాగము, సాంఖ్యము యోగము, శృంగారము వైరాగ్యము, ఇహము పరము, సర్గము ప్రళయము వైరుధ్యములు గాకను సహజధర్మసాధనములు.

సర్వమును బ్రహ్మపదార్థముగా తా నైనపుడు దివ్యసంకల్పము, దివ్యజ్ఞానము, దివ్యజీవనము జీవునకు సహజధర్మములు. జీవుడు "పుణ్యోఽహం, పుణ్యకర్మాహం, పుణ్యాత్మా, పుణ్యసంభవః" అని సంకల్పము సంకీర్తనము చేయుట ధర్మముకాని, "పాపోఽహం, పాపకర్మాహం పాపాత్మాపాపసంభవః" అని శోకించుట ధర్మము కాదు. వ్యాసజనకశుక శంకరాదులు జీవితపరమార్థమును సాధించినవిధమును వారిజీవితేతిహాసములువిశదము చేయుచున్నవి. జీవితపరమార్థము సకలజనులకును సాధ్యము. నష్టమైన పూర్ణయోగోద్ధరణమూలమునను దివ్యజీవనానుభవమును సాధ్యముచేయుట శ్రీ అరవిందయోగదర్శనాదర్శ

నము. శ్రీఅరవిందయోగదర్శనము, ప్రాచీనమైనను నవీనమైనను, మోక్షసాధనమై సకలజనారాధ్యముగ నున్నది. ఆర్యపత్రికయందును నితర గ్రంథములందును ప్రకటితములైనవ్యాసములు అనువ్యాఖ్యానములును శ్రీఅరవిందయోగతత్త్వమును బోధించుచున్నవిధము నీక్రిందిభావములు తెలుపుచున్నవి.

సంపూర్ణజీవనవికాసముపైననే యఖండాత్మస్థితి యాధారపడియున్నది. పదార్థములందలి యాత్మబలమే రూపములందును, వ్యవహారములందును వ్యక్తమగుచున్నది. మనపూర్వు లీ జ్ఞానమును బడసి యాచరించిరి. వారిసంతతుల యం దీ జ్ఞానము సన్నగిల్లి నష్టమై ఆచరణలో లేకపోయినది.

ప్రాగ్దేశమునకు ప్రతీచియొసంగు సందేశము నిజమైనదియే. మానవుడును భగవంతుడే; మానవత్వము వృద్ధిచెందుకొలది దేవత్వమునకు సన్నిహితంబగును; జీవితమును భగవానుడే. దాని వికాసమే బ్రహ్మముయొక్క ఆత్మవికాసము. జీవితమును నిరసించుట అంతర్వర్తియగు భగవానుని నిరసించినట్లగును. ఇదియే ప్రాచీనజ్ఞానము. ప్రాగ్దేశ మీసందేశమునువిని మేల్కొనుచున్నది. ఆశియా కొంతకాలము తన స్వభావమును ధర్మమును మఱచిపోయి, ఐరోపావిధానమున వానిని గ్రహించి, కేవలము పాశ్చాత్యానుకరణముగనో లేక దూష్యము వికృతమునగు మిశ్రమముగనో పొడసూపవచ్చును. అట్లయిన నది యపాయకరమే.

కావున ప్రస్తుత మాలోచింపవలసినదేమన, సరియైనభావమును సరియైన సమన్వయమార్గమును గనుగొనుట; మనశ్శరీరజీవితముల నాక్రమించి పూరించి యధిష్ఠించునటుల పురాతనము సనాతనము

నగు అధ్యాత్మతత్త్వమును పునర్నిర్వచనము చేయుట; అత్యుచ్చ బలైశ్వర్యములతో, మానవమనస్సు, అంతరాత్మలు, ఆత్మతత్త్వమును వ్యక్తము చేయనో పునట్టి యమోఘమును వీర్యవంతమునునగు నాధ్యాత్మిక శిక్షణలను యోగమును వృద్ధిపఱచుట; బాహ్యజీవనము, సంఘము, నడవడులు ఆత్మసత్యముపై నాధారపడి క్రమముగ పునర్నిర్మితములై మానవుని స్వేచ్ఛకును సంఘైక్యమునకును సంపూర్ణసమరసత్వమును సమకూర్పజాలు సాధనసంపత్తుల గనుగొనుట; ఇవిదే ప్రస్తుతము యోచింపదగిన విషయములై యున్నవి.

* * * *

పురాతనయోగములలో నీమార్గము నట్లే పూర్ణముగాగాని దానితో బాటుగాగాని వ్యవహరించినట్లు లేక స్వానుభవమునకు దెచ్చినట్లు నేను జూచియుండలేదు. నా కది లభించియుండి యున్నచో ముందుగా అంధకారమునుండి కాంతివంతముగావించి, సిద్ధపఱచి, దిద్దితీర్చి, ప్రతిష్ఠించి, నిరపాయముగా ప్రకాశము - బహిరంగము - గా గావింపబడినటువంటి ఆమార్గముల ననుసరించి నే నతిత్వరితగతి సుఖముగా నాగమ్యస్థానమునకు పరుగిడగలిగియుండి నపుడు తిరిగి నేను బాటల నిర్మించుటయందు ముప్పదిసంవత్సరములుగా తిదన్వేషణమందు, అంతస్సృష్టియందు నాకాలమును వ్యర్థపుచ్చియుండరాదు.

* * * *

ఆత్మయే సచ్చిదానందము. దానికిని ప్రపంచమునకును మాన రాని విరోధము కనుపించదు. ప్రపంచమును అజ్ఞానదృష్టితో జూచు చున్నాము, జ్ఞానదృష్టితో చూడవలెను. భౌతికజడతయందు లీనమై పూర్ణచైతన్యమును గాంచి వృద్ధిజెందుచున్న జ్ఞానమే మనయజ్ఞానము. ఆపరివర్తనమును బూర్తిచేసి మానవలోకమున నధ్యాత్మ జీవనమును

వికసింపజేయుటకే పునర్జన్మ పరంపరలు అవకాశములుగ నేర్పడినవి. పరిణామమునందలి సత్యమును మే మామోదించుచున్నాము. పాశ్చాత్యులచే దానికొసంగబడిన స్థూలరూపమున గ్రహించుట లేదు. ప్రాణము మనస్సు, ఆత్మ, ఇచ్చట భౌతికములో లీనమై క్రమక్రమముగ వ్యక్తమగుచున్నవను తత్త్వనిరూపణమునే గైకొనుచున్నాము. ఈ పరిణామముయొక్క శిఖరమున నధ్యాత్మజీవన దివ్యజీవనయోగలదు.

భాగవత పరాయణమైన ఆత్మానందానుభవము సర్వమునకును సాధ్యమైన పరమార్థము. ఆ పరమార్థము సప్తలోకములందును సాధకులకు ప్రత్యక్షముగ నున్నది. సత్యలోకమునందువలెను భూలోకమునందును దివ్యానందానుభవము సకల జనులకును సాధ్యము. విశ్వమునందు సచ్చిదానందాత్మకమైన ఆత్మజీవనము శాంతశివసుందరజీవనమును సాధ్యము చేయుచున్నది. సర్వాత్మత్వము పూర్ణయోగపరమైన అస్తిత్వమునందువలెను నాస్తిత్వమునందు సాధ్యముగాదు. పరమేశ్వర పరాయణమైన సర్వాత్మత్వము సిద్ధించునపు డణిమాద్యష్టసిద్ధులును సులభలభ్యము లగుచున్నవి. సర్వాత్మతాశ్రయములైన కర్మలు, ధర్మములు, యోగములు దివ్యజీవనమునకు సాధనములు గాని ప్రతిబంధకములు గావు. బాహ్యాభ్యంతరములందు పూర్ణయోగ మద్వితీయమైన ఆత్మత్వసిద్ధికి పరమార్థము. పరమార్థానుభవ సిద్ధికి

కోటియం దొకానొకరు ప్రయత్నించుదురు. ప్రయత్నించినవారియందును పూర్ణయోగానుభవ సిద్ధమైన ఆత్మత్వమును తత్త్వతః పొందగలవారు కృతార్థులు. అరవింద యోగదర్శనము పూర్ణయోగ తత్త్వార్థమును యథార్థముగను బోధించుట కేర్పడినది.

శ్రీ అరవింద యోగాశ్రమము యోగసాధన పరాయణులైన జిజ్ఞాసువులను, విద్యావంతులను, యోగులను ధీమంతులను నాకర్షించుచున్నది. శ్రీ అరవింద యోగులు సుప్రసిద్ధ గురువులు. భాగవత తత్త్వమైన పూర్ణయోగతత్త్వము దురారాధ్యము. నావంటి సామాన్యున కీ యోగతత్త్వావబోధము దుర్లభము. అయినను నా కీపరిచయవాక్యములను వ్రాయుట కవకాశమును గల్పించిన నా మిత్రునకు కృతజ్ఞుడను. శ్రేష్ఠుల యాచరణములు సామాన్యుల కనువర్తనయోగ్యములు. భక్తియోగపరాయణులైన ఆంధ్రప్రజ లీగ్రంథము నాదరించి ప్రకాశకుల సత్ప్రయత్నములను అరవిందుని యోగదీక్షను, స్వీయపురుషార్థమును సఫలముచేయుదురుగాత!

ధాత వైశాఖ
బహుళ పంచమి

కా. నాగేశ్వరరావు.

# విన్నపము

---

భగవానుని అనుగ్రహమున శ్రీ అరవింద జీవిత చరిత్రమును బ్రకటించి యాంధ్ర లోకమున కందించు భాగ్యము నాకు లభించినది. ఇంతమాత్రము విపులముగా నేని మఱి యే భాషయందును శ్రీ అరవిందుల జీవిత చరిత మింతవఱకు ప్రకటితమైనట్లు గనపడదు.

శ్రీ అరవిందు లాకాలమున రచించిన కొన్ని వ్యాసములు, వారు తమ ధర్మపత్నికి వ్రాసియుండిన లేఖలు నాంధ్రీకృతములై కృష్ణాపత్రికయందు బ్రకటిత ములై యుండెను. వాని నీగ్రంథమున నుపయోగించు కొనుట కనుజ్ఞ దయచేసిన కృష్ణాపత్రికాధి పతులకును నా మిత్రుని ప్రార్థన నంగీకరించి కృష్ణాపత్రి కాధిపతు

లతో నీవిషయమున మాటాడి వారి యంగీకారమును సంపాదించి యిచ్చియు ఆనాటి కృష్ణాపత్రికా సంపుటముల నన్నింటిని స్వయముగా వెతకి ఆ అనువాదములను గనుగొని వాని ప్రతి వ్రాయించిపంపియు నెంతో సాయపడిన 'గోష్ఠి' పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ జి. వి. సుబ్బారావు గారికిని నాకృతజ్ఞతా వందనముల నర్పించుచున్నాను.

కృష్ణాపత్రికయందు ప్రకటితమైన శ్రీ అరవింద లేఖల వంగభాషనుండి నాడాంధ్రీకరించినది ఆంధ్ర మాతకనుంగు పుత్రికారత్నము దేశసేవాపరాయణియునై స్వర్గమలంకరించిన పుణ్యవతి మాగంటి అన్నపూర్ణాదేవి. ఆ యనువాదమును తిరిగి మాతృకతో పోల్చిచూచియు, శ్రీదేవిగారు, వ్యక్తిగతములని గాబోలు, అనువదించని యొకటిరెండుభాగముల ననువదించియు సాయమొనర్చిన శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ, బి. యెల్ గారికిని శ్రీ అరవిందుల పట్లగల భక్తివిశ్వాసములతో అస్మదీయ మిత్రప్రోత్సాహమున ఈగ్రంథ ముద్రణవ్యయమునంతను భరించిన సోదరీ సోదరులకును, తమ సహజౌదార్యముతో నీగ్రంథ

మున నుపయోగించిన బ్లాకుల - దిమ్మెల - నుచితముగా తయారుచేయించియు స్వకీయ ఆంధ్రపత్రికాముద్రాక్షర శాలయందు చక్కగా ముద్రింపించియు అమూల్యమగు నుపోద్ఘాతమును వ్రాసియు నీగ్రంథవిక్రయమునకును తమ కార్యాలయమున దగునేర్పాట్లు దయతో నొనర్చియు నిట్లనేకవిధముల దోడ్పడిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికిని అభిమాన పురస్సరముగా నాకృతజ్ఞతను వెల్లడించి నమస్కరించుచున్నాను.

గుత్తి
౧౫-౧౧-౩౬

ఇట్లు
విధేయుడు,
టి. కోదండరామయ్య.
ప్రకాశకులు.

శ్రీ

# శ్రీ అరవింద జీవితము

## మొదటి తరంగము

పరమేశ్వరుని లీలావిలాస మత్యద్భుతము. సృష్టిక్రమ విధాన మిదియని నిర్ణయించగ్గాదు సరిగదా ఊహించుటకేని మానవునికి సాధ్యము కాదు. శాస్త్రజ్ఞుల సృష్టిపరిణామసూత్రముల ననుసరించిచూచినచో మానవజన్మ ముత్తమోత్తమము అనదగును. నరజన్మమందే శ్రీమన్నారాయణవిలాసమహిమ ప్రస్ఫుటమై నరనారాయణత్వసిద్ధి లభింప నవకాశ మున్నది.

నారాయణత్వ మంతర్గర్భితమై యున్నందుననే మానవుని జీవిత మత్యంత నిగూఢము, క్లిష్టము, దుర్గ్రాహ్యము నగుచున్నది. అతని జీవితచరిత్రము సమగ్రముగ నాతనికే తెలియదు. ఇట్లు స్వీయచరిత్రములే యసంపూర్ణములుగా నున్నపుడు, ఇతరుల జీవిత

చరిత్రము వ్రాయగడంగుట పరిహాసాస్పదమే. అందు నను అంతర్ముఖులైన యోగీంద్రుల, అవతారమూర్తుల, పురుషోత్తముల పవిత్రచరిత్రమును నుల్లేఖింపబూనుట నిజముగా సాహసము.

శ్రీ అరవిందుల జీవితచరిత్ర మందఱకు దెలియు నట్లు ఉపరితలమునగాక కేవల మంతస్థితమై యున్నది. అందువలన వారిచరిత్రమును సమగ్రముగా వారు తప్ప మఱొక రెవరును రచింపజాల రనుట అతిశయోక్తి కాజాలదు. ఈ యాథార్థ్యము నెఱింగియు వారిపట్లగల భక్తివిశ్వాసముల నండగా జేసికొని, ఆంధ్రమున నింత వఱకు ప్రముఖు లెవరును శ్రీ అరవిందులను గుఱించి గ్రంథ మేమియు రచించనందున, ఆంధ్రలోకమున కూడి గముగా, శ్రీ అరవిందుల జీవితవిశేషములను సాధ్య మైనంతవఱకు వారివాక్యముల ననుసరించియే సూక్ష్మ ముగా వెల్లడింప బ్రయత్నించుచున్నాము.

## జన్మస్థానము

స్థలమాహాత్మ్య మారం దుద్భవించిన మహాపురు షుల నాశ్రయించి యుండుటయు నెందఱో మహాను

భావుల యౌన్నత్యము వారు జన్మించిన స్థలవిశేషముల బట్టి యుండుటయు గాననగును. శ్రీ అరవిందులవిషయమున నీరెండును అన్యోన్యాశ్రయములుగా విరాజిల్లుచున్నట్లు తోచుచున్నది. వేదఋషుల సామగాన మాధురీవాసనల తనివితీర గ్రోలి శోభప్రదమై నిర్దోష కలితమై పూజనీయయగు గంగామతల్లిచే పునీతమైనది వంగదేశము. అందుననే గంగాస్రవంతివలె ఏకధారగా వంగమాతగర్భమునుండి పరమహంసలు, యోగులు, తపోధనులు, భక్తాగ్రేసరులు, సాధుపుంగవులు, కవిశ్రేష్ఠులు, శాస్త్రజ్ఞులు, పండితులు, మేధావులు, దేశోద్ధారకులు, త్యాగులు, శ్రీమంతులు నుద్భవించుచున్నారు. రామప్రసాద్, గౌరాంగ, రామకృష్ణ, రామమోహన్, వివేకానంద, బంకించంద్ర, దేవేంద్రనాథ్ ఠాగూర్, కేశవచంద్ర, మధుసూదన, రాజనారాయణ, శిశుకుమార, బంధోపాధ్యాయ, సురేంద్రనాథ, చిత్తరంజన్ మున్నగు పుత్రరత్నముల గాంచి వంగమాత ధన్యయైనది. ఇదంతయు మాంధాతకాలపు విస్మృత చరిత్రగా గాక ప్రత్యక్షముగా నీనాడును సుప్రసిద్ధ విజ్ఞానశాస్త్ర విశారదులను, చరిత్ర పరిశోధకులను, పత్రికాసంపాదకులను, కవిచక్రవర్తులను, వక్తలను,

ప్రతిభాశాలురను, స్వార్థరహితులను, పరోపకారపారీణులను, మాతకై 'ప్రాణంబుల్ పువ్వులట్లు జల్లు' వీరులను, త్యాగులను, వేయేల సర్వతోముఖముగ నేవిషయమందేని మేల్బంతిగానున్న పుత్రుల నెందఱనేని సగర్వముగా వంగదేశము పేర్కొనగలదు. ఇట్లనాదిగా పవిత్రసంతానభాగ్యమును గాంచి అసమానయోగ్యతావిశేషముల నందిన వంగదేశమందు శ్రీ అరవిందు లుద్భవించుట సముచిత మనియే తలంపనగును. మఱియు బరమేశ్వరుడు గ్రుడ్డివానిచేతి ఱాయిగాగాక యేదో సంకల్పముతోడనే దేశకాలపాత్రముల బరిశీలించియే మహాపురుషుల జన్మక్షేత్రముల నిర్ణయించుచుండునని యూహించదగియున్నది.

## వంశ విశేషములు

వృక్ష జంతుజాతులలోవలె వంశసంబంధము మానవులందంత బలీయముగా నున్నట్లు గవపడదు. కేవల మనాగరికజాతులందు కంటె వ్యవసాయాత్మిక బుద్ధిగల గౌరవ నాగరిక వంశములందు వంశ సాంప్రదాయము మఱింత కొంఱవడినట్లు తోచుచున్నది. అయినను శ్రీ అరవింద

వంశ మత్యంత సుప్రసిద్ధమై ప్రాచ్యపాశ్చాత్య సభ్యతా సమ్మేళనమందు కొంత సంబంధముగలదై వంగదేశ వికాసమునకు యథాశక్తి తోడ్పడి పేరుమోసినదే.

పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభకాలమున భారతదేశము ముఖ్యముగా వంగదేశము ప్రాచీప్రతీచుల వికారమునకుమాత్రము లోనై విచిత్రసంయోగ సంఘట్టనల కాలవాలమైనది. ఒకవంక వేదకాలపు ఆధ్యాత్మికవికాసమంతరించి తొల్లింటి ధర్మశాస్త్రముల సమన్వయింపగల సర్వాంకషమైన దేవభాషాజ్ఞానముగాని స్వతంత్రాలోచనాపటిమగాని అనుష్ఠానమహిమగాని లేక సనాతన ధర్మసూత్రములకే భిన్నముగాగల మూఢాచారములు, అర్థశూన్యములైన ఆడంబరపు తంత్రకలాపములు, బాహ్యాట్టహాసములు నివియే మతసారమని నిరంకుశులుగా నధికారము చెలాయించు గురువులు, మతోద్ధారకులును, మఱొకవంక పాశ్చాత్య నాగరకతయన్న సభ్యతయన్న జోహారులొనంగి వెనుకముందు లారయక, వేషభాషలందేమి అనుదినాచారములందేమి ఆమూలాగ్రముగ దొరల ననుకరించుటయే గౌరవభాజనమని విశ్వసించి, మన మత భాష వేష సంప్రదాయములందు నిరసనమే గాక విరోధభావము గలిగి, ప్రచ్ఛన్నక్రైస్తవు

లనదగు నవనాగరికులును దేశమును చీకాకుపఱచిన కాలమది. ఈ కాలప్రవాహమునకు ఆహుతులయ్యే మధుసూదన్, కాళీమోహన్, బందోపాధ్యాయ, కాళీచరణబెనర్జీ మున్నగు ప్రతిభాశాలురు స్వమతమును త్యజించి క్రైస్తవమతమును స్వీకరించిరి.

నాటి వంగదేశమున మూర్తీభవించి యుండిన పాశ్చాత్యసభ్యతావ్యామోహమునకు దాసులైనవారును, తన్నివారణార్థమై ఆర్యావర్తపు జాతీయజీవనమును సభ్యతను భావములను బునరుద్ధరించ దీక్షవహించిన వారును శ్రీ అరవిందుల వంశమున గలరు. ఆధునిక వంగదేశ నిర్మాతలలో నొక్కరుగా బూజనీయులైన శ్రీ రాజనారాయణబోసు శ్రీఅరవిందుల మాతామహులు. వీరు వంగ, సంస్కృత, పెరిషియన్, ఆంగ్లేయాది భాషలందు నాడు మేటిపండితులు. తన పదునెనిమిదేండ్ల బాల్యప్రాయమందే బ్రహ్మసమాజపక్షమున నుపనిషత్తులను వంగాంగ్లభాషలందు పరివర్తన మొనర్చుటకు నియోగింపబడిన మేధావి. నాటి కాలప్రవాహమున మొదట బ్రహ్మమతావలంబియై కొంతకాలము బ్రహ్మసమాజమున కధ్యక్షతగూడ వహించియుండినను బ్రహ్మసమాజ సభ్యుల పాశ్చాత్యానుకరణములకు కేశవచంద్రునివిపరీతవర్తనము

నకు బోసి తత్సమాజ సంబంధమును త్యజించి 'హిందూ మతాధిక్య' మను కరపత్రమును సప్రమాణముగ నశా స్త్రీయముగ రచించి వంగీయుల మేల్కొల్పి మతభ్రష్టులు గాకుండ నండగా నిలిచిన మతోద్ధారకుడు. ఈతని పాండిత్యమును బుద్ధికుశలతను యోగ్యతను గాంచి, వశీకృతుడై మిత్రుడై మిక్కిలిగారవించుచు నున్నతాధికార మందుండిన సర్ హెన్రీ కాటన్ ఎన్నిపర్యాయములో డిప్యూటి కలెక్టరు ఉద్యోగమును స్వీకరించవలసిన దని సర్వవిధముల ప్రోత్సహించి బ్రతిమాలినను ప్రభుత్వోద్యోగము నంగీకరింపని స్వతంత్రమూర్తి, స్వార్థత్యాగి. దేశీయమహాసభా నిర్ణయమున కిరువదియైదు సంవత్సరములకు పూర్వమే విదేశవస్తు ప్రవాహము నరికట్టుటకు జాతీయ వస్తుప్రదర్శనములను, దుర్బలులగు దేశీయులను వీర్యవంతులుగా నొనర్చుటకు వ్యాయామ ప్రదర్శనములను నెలకొల్పిన జాతీయాభిమాని. వీరు ప్రత్యక్షముగా రాజకీయరంగమున నంతగా బనిచేయకున్నను మత సాంఘిక విద్యాదివిషయములందు కృషిచేసి తత్సంబంధముగా నెన్నియో గ్రంథముల రచియించి జీవచ్ఛవమై యున్న జాతిలో ప్రాణముపోసి యుత్తేజమును బుట్టించిన దేశోద్ధారకుడు. ఈమహామహుని ప్రథమ పుత్రికా

రత్నమగు స్వర్ణలతాదేవియే శ్రీ అరవిందుని గాంచిన పుణ్యవతి.

పితామహుల చరిత్ర మంతగా దెలియదు. శ్రీ అరవిందుల తండ్రిగారగు కృష్ణధనఘోషు గంగాతీరమున కలకత్తాకు పదుమూడు మైళ్ల దూరముననున్న 'కొన్నాగర్' గ్రామవాసి. కృష్ణధనఘోషుగారు మిక్కిలి మేధాసంపన్నులు. విద్యాభ్యాసకాలమునుండియే వంగదేశమున నా డావరించియుండిన పాశ్చాత్యభాషా సభ్యతల పై మెఱుంగులకు లోనైనవారే. ప్రారంభమున వైద్యవిద్య నభ్యసించి సబ్ అసిస్టెంటుసర్జనుగా చిన్నయుద్యోగమున నే జీవితము ప్రారంభించినను తన శక్తిసామర్థ్యములవలన ఇంగ్లాండునకు వెళ్లి యున్నత విద్యాభ్యాస మొనర్చుటకు వలయు ధనమంతయు స్వాయముగా నార్జించి, విదేశమున కేగి, ఐ. యమ్. ఎస్. పరీక్షయందుత్తీర్ణులైన ప్రతిభాశాలి. ఆకాలములో విదేశప్రయాణముగాని ఐ. యమ్. ఎస్. పరీక్షయందుత్తీర్ణులగుటగాని భారతీయులలో మిక్కిలి యపురూపము. బాల్యములోనే యలవడిన పాశ్చాత్య సభ్యతానుకరణము విదేశవాసమువలన వైద్యవృత్తి మూలముననను మఱింత ప్రబలి వేషభాషలందు భావములందు నిత్యజీవితమందు మూర్తీభ

వించినది. కాని బాహ్యారూప మెంత విజాతీయముగ గాన్పించినను హృదయము మాత్రము భారతీయమే యని బీదల కొసరించిన వారి నిరుపమాన సేవ, కార్య నిర్వహణసామర్థ్యము, దోమలమయమై చలిజ్వర భూత మున కధిష్ఠానపీఠమై సర్వవిధముల ననారోగ్యముతో తాండవమాడుచుండిన నాటి ఖుల్నాపట్టణమును వీ రత్యంత ఆరోగ్యప్రదేశముగ పరివర్తన మొందించి తత్కాలమున బడసిన చిరకీర్తియు వేనోళ్ల జాటుచున్నవి. వీ రట త్రవ్వించిన కాలువ వీరి పేరుతో నేటికిని స్మర ణీయ మగుచున్నది.

స్వర్ణలతాదేవి కృష్ణధనఘోషు దంపతులకు నలుగురు పుత్రరత్నములు, నొక పుత్రికామణియు జనించిరి. కృష్ణధనుడు తన మేధాసంపత్తునకు నున్నత భావములకు నూతన పోకడలకు దగినట్లే తన సంతానమునకు నామ కరణ మొనర్చెను. ప్రథమపుత్రుడు వినయభూషణుడు, ద్వితీయుడు మనోమోహనుడు. ౧౮౭౨ వ సంవత్సర మున ఆగస్టునెల తే ౧౫ ది సుముహూర్తమున నీ లోక మున కవతరించిన మన అరవిందులే వారి తృతీయపుత్ర రత్నము.

## జాతకము

స్వస్తిశ్రీ ఆంగీరసనామ సంవత్సర శ్రావణ శు ౧౧ లు ౧౫. ౪౪ గురువారము మూలా నక్షత్రము ౨౦-౧ విష్క. ౧౮-౧౦ భద్ర ౧౫-౪౪ భుక్తి ౦.౪ లీ శుభదినమందు ఉషఃకాలము సుమారు 5 ఘంటలకు ౧౮౭౨ సంవత్సరము ఆగస్టుమాసము తేది౧౫, సూర్యోదయాత్పూర్వము ఒక ఘంటకు కర్కట లగ్నమందు శ్రీ అరవింద జననము.

| | | | |
|---|---|---|---|
| | | రా | |
| | | | ల శు గు |
| | రాశి | | ర బు కు |
| చ శ | కే | | |

శ్రీ అరవిందుల జననకాలమును నాటి గ్రహస్థితులను సూచించు లగ్నకుండలినిమాత్ర మిందు పొందుపఱచుచున్నాము. జ్యోతిశ్శాస్త్రమందు సంపూర్ణ పాండిత్యాభిమానములు గల శాస్త్రజ్ఞులే ఫలముల సూచించ నర్హులు. కాని శ్రీ అరవిందు లొక జ్యోతిశ్శాస్త్ర గ్రంథమును తమ ఆర్యపత్రికలో విమర్శించుచు తమ జాతక విషయమై వెల్లడించిన వాక్యములనుమాత్ర మిం దుదాహరించుచున్నాము.

ఈ విషయమున స్వానుభవము కొంత గలదు. రాజకీయరంగమున నేను ప్రవేశించకముందే, పేరు ప్రతిష్ఠలు ప్రాకకముందే బరోడాలో నున్నపుడు నా పేరుకూడ దెలియని యొక జ్యోతిష్కుడు, బలవంతులగు భారతేతరులతో రాజకీయముగా సంఘర్షణమున నేను దగుల్కొనుట నిశ్చయ మనియు కొంతకాలము తత్సంబంధముగా నాకు ప్రాణాపాయస్థితి కలుగునంతటి విషమదశ సంభవించు ననియు జెప్పియుండెను. మఱొక పర్యాయము 'వందేమాతరమ్' అభియోగము నాపై నున్నపు డీతడే యొకటివెంట నొకటిగా నిట్లు మూడు పర్యాయములు నాపై దోషారోపణము లొనర్చబడు ననియు ప్రతి అభియోగము నందును ప్రతిపక్షమే యపజయము గాంచుట నిశ్చయమనియు వెల్లడించియుండెను. ఇంతకు నాజన్మకాల మిదియని గట్టిగానిశ్చయించుటకు వీలులేని యనుమానదశ యుం దున్నది, ఖచ్చితముగా చెప్పగాదు.

మఱియును జ్యోతిశ్శాస్త్రము భావి ఫలమును సూచించునేగాని స్పష్టముగా నిర్ణయించజాల దనియు మానవప్రజ్ఞ నతిక్రమించి దైవప్రజ్ఞను గాంక్షించు యోగసాధకునిపట్ల జ్యోతిశ్శాస్త్రముగాని మఱియే భౌతికశాస్త్రముగాని కార్యకారులు కావనియు శ్రీ అరవిందు లొకచో వెల్లడించియున్నారు.

ఈ యరవిందనామ మంతవఱ కెవరును ధరించి యుండని వినియెఱుంగని కృష్ణధనుని నూతనసృష్టియే. వీరు తన పుత్రు డపూర్వ మానవమూర్తియై వేదఋషులును బ్రయత్నించి యెఱుంగని పరమవిజ్ఞానమును — సూపర్ మైండు—ఆర్జించి తద్దివ్యశక్తిని తనలో సధిరోహింపజేసి కొనుటయేగాక భూతలమున బ్రతిష్ఠించి అజ్ఞానము, బాధాయుతము, దుఃఖభాజనమునగు భూలోకమునే స్వర్గలోకముగా, దివ్యలోకముగా, మానవులను దేవతలనుగా బరివర్తన మొనరించి సత్యయుగమును బునరుద్ధరించునని యెఱుంగకున్నను ఈ క్రొంగ్రొత్త నామముతో తనపుత్రు నలంకరించిరి. నాలవసంతానమే పుత్రికామణి యగు సరోజినీదేవి. విప్లవబ్రహ్మయని బిరుదము గాంచిన వరేంద్రుడు వారి కనిష్ఠపుత్రుడు. కృష్ణధనుడు కాంక్షించినట్లు తన సంతాన మేదో యొక విధముగ తనకు మించిన

కీర్తిప్రతిష్ఠల జూరగొనినవారే కాని తల్లికడుపుచేటుగ నుదయించినవా రొక్కరును లేరు. వినయభూషణుడు కుచ్బిబిహారు రాజ్యమున రాజకుమారుల కాచార్యులుగాను సంస్థాన వ్యవస్థాపకులుగాను చిరకాల మున్నతపదవియం దుండి కీర్తిప్రతిష్ఠల నార్జించియున్న వారు. మనోమోహన్ రాజధానీ కళాశాలలో నాంగ్ల భాషాపండితులుగ నాంగ్లమున రసభరితములైనపద్యముల రచియించి పాశ్చాత్యదేశమునందును కవిగా, బ్రసిద్ధి గాంచి పది పదునైదు సంవత్సరముల క్రిందటనే కీర్తి శేషులైరి. వరేంద్రుని–బరీంద్రు - త్యాగము సాహస కృత్యములు లోక మెఱింగినవే. ఏకైక పుత్రికయగు సరోజినీదేవియు విద్యావతియై తత్త్వజ్ఞానాభిలాషిణియై ఆజన్మ బ్రహ్మచారిణియై తనకు నచ్చిన ఆధ్యాత్మిక జీవనమున గాలము గడపుచు కులభూషణియై యున్నది. శ్రీ అరవిందులే యొక సందర్భమున 'నావిషయ మటుండనిచ్చినను తక్కిన సంతానముగూడ తండ్రి మనోభీష్టానుగుణ్యముగ సుప్రసిద్ధమైనవారే' అని సెల విచ్చియుండిరి. ఇక శ్రీ అరవిందుని గుఱించి వేఱ్కొన వలయునా? మాతామహుల విశాలదృష్టి, విచక్షణజ్ఞానము, సత్యాన్వేషణదీక్ష, తండ్రిగారి స్వార్థ

త్యాగము, పరోపకారపరాయణత్వము, కార్యనిర్వహణసామర్థ్యము మున్నగుగుణము లుగ్గుపాలతో నలవడి నేటి శ్రీ అరవిందుని యనంతగుణరాజములకు దోహదము లైనవి.

## విద్యాభ్యాసము – విదేశవాసము

లోగడ సూచించినట్లు కేవలము పాశ్చాత్యానుకరణమునకు లోనై పాశ్చాత్యసభ్యత్వలబ్ధియే యాదర్శముగా నిడుకొనిన డాక్టరు కృష్ణధనుడు తన బిడ్డలకు తోడిహిందువులవలె సామాన్యపాఠశాలలందు చదువు చెప్పించుట కిష్టపడలే దనిన వింత గాదు. కాన వీరు వ్యయప్రయాసలకు లక్ష్యపెట్టక, చిన్నబిడ్డయగు నరవిందుని దూరముగా డార్జిలింగున కంపి, 'సెంటుపాల్ స్కూ' లను అచ్చటి దొరలపాఠశాలలో ఏ, బి, సీ, లతో నక్షరాభ్యాసము గావించెను. అదియు తృప్తికరము గాక డాక్టరుగా రరవిందుని కేడేండ్లు వచ్చియు రాక మునుపే తన ముగ్గురుపుత్రులను కుమార్తెను ధర్మపత్నిని వెంటనిడుకొని సకుటుంబముగా బిడ్డల విద్యాభ్యాసమునకై ఇంగ్లాండునకు కాపుర మెత్తివెళ్లెను.

అచ్చటనే కడగొట్టుకుమారుడు వరేంద్రుడు జన్మించెను. ఇతడు జన్మించినతరువాత, వినయభూషణ్, మనోమోహన్, అరవిందులను మాంచెస్టరు పట్టణమునందు తన మిత్రుడగు 'డ్రూట్' అను దొరగారి కుటుంబమున దిగవిడిచి సరోజినీ వరేంద్రులను ధర్మపత్నిని తనతో తీసికొని వంగదేశమునకు మరలివచ్చిరి. ఆమాంచెస్టరుపట్టణమందలి యాంగ్లేయకుటుంబముననే అరవిందులించుమించు ఆఱుసంవత్సరములు విద్యాభ్యాస మొనర్చిరి. ఆకాలముననే ఫ్రెంచిభాష నభ్యసించి మెప్పుగాంచిరి. ౧౮౮౫ వ సంవత్సరమున లండన్ పట్టణములోని 'సెంట్ పాల్' వాఙ్మయపాఠశాలయందు ప్రవేశించి తమ బుద్ధిచాతుర్యమువలన నుపాధ్యాయవర్గమునుండి మన్ననల జూరగొనిరి.

ఐదుసంవత్సరము లచ్చట విద్య నభ్యసించి ౧౮౯౦ వ సంవత్సరమునందు ఐ. సి. యస్. పరీక్షకు నిలచి గ్రీక్, లాటిన్ భాషలలో నదివఱ కెవరును గడించని అత్యధికగుణముల సంపాదించి యుత్తమతరగతిలో నుత్తములుగా నుత్తీర్ణులైరి. ఐ. సి. ఎస్. పరీక్ష యైన తరువాత శిక్షణాభ్యాస- (ప్రొబేషనరీ) - కాలమగు రెండేండ్లలో శ్రీ అరవిందులు విద్యార్థి వేతనము గడించి కేం

బ్రిడ్జియందలి 'కింగ్సు' కళాశాలలో విద్య నభ్యసించి పాశ్చాత్య భాషలయం దుత్తములుగా నుత్తీర్ణులయి 'ట్రైపాస్' పట్టభద్రమును బొందిరి. ఐ. సి. ఎస్. తర్ఫీతు - ప్రొబేషనరీ - కాలాంతమున, బ్రిటిషు ప్రభుత్వమునం దుద్యోగము చేయరాదను నిశ్చయముననేమి అంతర్వాణి ప్రేరణముననేమి, విధాయకమైన గుఱ్ఱపు స్వారి పరీక్షకు హాజరుగాక ఐ. సి. ఎస్. ను త్రోసిపుచ్చిరి. బాల్యము నుండియు దేశారాధనము ఈశ్వరసేవయు వీరి యాదర్శములని వీరు తమ ధర్మపత్నికి ౧౯౦౫ లో వ్రాసిన లేఖయందలి "......చతుర్దశ వర్షప్రాయమునుండి బీజ మంకురింపదొడంగె. అష్టాదశప్రాయమున నా ప్రతిష్ఠ దృఢమై యచలముగావించెను." అను వాక్యమువలనను, ౧౯౦౭ లో కలకత్తా జాతీయకళాశాలను వదలి వచ్చుసందర్భమున వీడ్కోలు సభయందు విద్యార్థుల కుపదేశించిన వాక్యములవలనను స్పష్టము గాగలదు. ఈశ్వరేచ్ఛ బలీయము గదా!

విద్యార్థిగా శ్రీ అరవిందులు ప్రకటించిన నిరుపమాన మేధావిశేషము లింతింతనరాదు. ఇంచుమించు పాశ్చాత్యభాష లన్నింటియందు నపారపాండిత్యమును గడించిరి. దాంతి, గేటే మున్నగు సుప్రసిద్ధ గ్రంథ

కర్తల భావవిశేషములను తత్త్వరీతులను ఆయాభాషల లోని మూలగ్రంథముల బఠించి క్షుణ్ణముగా గ్రహించ గలిగినంత పాండిత్యమును ఇటాలియన్ జర్మనీభాషల యందు సంపాదించిరి. తండ్రిగారియాజ్ఞ యనియో యభిలాష యనియో వారికి సంపూర్ణసంతృప్తి కలుగునట్లు పూర్వ, మధ్య, ఆధునిక, కాల ఐరోపియన్ సభ్యతను చరిత్రవిజ్ఞాన సంప్రదాయములను సాకల్యముగా బరిశీలించి గ్రహించిరి. వేయేల, పాశ్చాత్యవాఙ్మయమున వారు పరిశీలించని సాహిత్యముగాని, శాస్త్రముగాని, తత్త్వముగాని లేదు. ఈకాలమున నింగ్లాండునందుండగనే ఆంగ్లమున రసోత్తర పద్యముల రచించి కవిగా పేరెన్నికగన నారంభించిరి. అరవిందులవలె యన్యభాషలలో నింతటి ప్రావీణ్యము జూపిన విద్యార్థి లేడని ప్రసిద్ధిగలదు. నాటికి సరిగా పదునాలు సంవత్సరముల కావల ౧౯౦౮-వ సంవత్సరమున, ఆలిపూరు బాంబుకేసునందు ఘోరనేరముల క్రింద శ్రీఅరవిందులు బందీకృతులై విచారణ జరుగుచుండగా వీరి విషయము లండన్‌పత్రికలలో బ్రకటితమైనపుడు, వృద్ధులైయుండిన 'సెంట్‌పాల్' పాఠశాలాధ్యక్షు డిట్లు వెల్లడించియుండెనట: "నాయొద్ద నిరువదైదు ముప్పది సంవత్సరములుగా

విద్యాభ్యాస మొనర్చిన వేనవేలు విద్యార్థులలో అరవిందు లంతటి ప్రతిభాశాలిని, మేధా సంపన్నుని, సుగుణ భూషణుని గాంచియుండలేదు". జ్ఞానార్జనమే దీక్షగా గైకొని యన్యభాషలయం దనర్గళపాండిత్యమును గడించి యున్నను తండ్రిగారి పెంపకముమాహాత్మ్యమున గాబోలు మాతృభాషయగు వంగభాషమాత్రము అరవిందులకు తెలియకుండెను! ఐ. సి. ఎస్. పరీక్ష ఆంగ్లేయు లెట్లు సంస్కృతమునో హిందూస్థానినో బలవంతముగా రెండు ముక్కలు నేర్చి పరీక్షాసమయమున నప్పగించివేయుదురో యట్లు బెంగాలీ యక్షరములను శ్రీ అరవిందులు తన పదు నెనిమిదవ సంవత్సరమున నభ్యసించినట్లు తెలియు చున్నది.

డాక్టరు కృష్ణధను డమృతహస్తుడై వేలకొలది ధన మార్జించుచున్నను ఆఱువేలమైళ్లదూరమున ధనమే సర్వస్వముగా నెన్నబడు లండన్ పట్టణమున నున్న తన ముప్వురు పుత్రులకు వలయు ధన మంపజాలక, వారిని దారిద్ర్యము ననుభవింప జేసిరనిన విచిత్రముగా దోపక మానదు. స్వార్థమెఱుంగని కృష్ణధనుడు, దయాస్వరూపి యగు కృష్ణధనుడు తనకండ్లయెదుట కట్టబట్ట తిన తిండి లేక యల్లాడుచున్న దరిద్రనారాయణులకు 'దేహి'యని

చేయిజాచిన యాచకులకు తనవరుంబడిని వ్యయపఱచు చుండెను. నిత్యజీవనమందు నాహారవేషాదులందు దొరల ననుకరించువాడై యుదారుడైనందున స్వాంతఖర్చులు కుటుంబఖర్చులు హెచ్చుగానుండెను. దీనికితోడు పరుల కష్టముల గండ్లారజూచి సహింపజాలని ధర్మమూర్తి, పరోపకారమం దానందమనుభవించు పుణ్యపురుషుడు. అందుననే తనకుమారులకు క్రమముగా కావలసిన ధనమును బంపుటకు సాధ్యము గాకపోయినది. ఇందుల కాతని, తనకు మాలినధర్మ మొనర్చువాడని పొదుపెఱుంగని పిచ్చివాడని దూబరియని యనేకవిధముల, బరిహసించి నిందించిన బంధువులు మిత్రులును గలరు. కాని నిఱుపేదలు, దిక్కులేని యనాథలు, ఎందఱో లెమ్ము గాపాడిన ధర్మాత్ముడని చేయెత్తి నమస్కరించుచు జోహారులొనర్చుచుండిరి. ఎట్లయిననేమి ధనాభావమువలన విదేశములో కొమారు లత్యంతకష్టముల ననుభవించినది మాత్రము వాస్తవము. మనోమోహన్ విద్యాభ్యాసమునకు కొంత అంతరాయము గలిగినది. ఈకాలమందే కృష్ణధనులు కీర్తిశేషులైరి. అంత మున్ముందు వినయభూషణు డెట్లో స్వదేశముచేరి కుచ్‌బిహారునం దుద్యోగము సంపాదించుకొని యెచ్చటనో పెద్ద మొత్తమును

ఋణముగా తీసికొని తమ్ములకుబంపినట్లును ఆధనముతో నింగ్లాండునందలి ఋణముల దీర్చి మనోమోహానుడు విద్యాభ్యాసము పూర్తిగావించి ఇండియాకు మరలి వచ్చినట్లును దెలియుచున్నది.

---

# శ్రీ అరవింద జీవితము

---

## రెండవ తరంగము

### ఉద్యోగము - బరోడావాసము

శ్రీ అరవిందులు ఐ. సి. ఎస్. కాబదన్ని విదేశములో ధనాభావముచేత కష్టముల పా లగుచున్నకాలమున, ప్రాయశః ౧౮౯౨-వ సంవత్సరాంతముననే బరోడామహారాజు ఇంగ్లాండునకు వెళ్లుటయు నచ్చట భారతీయ విద్యార్థికులలో ప్రతిభాశాలి యని పేరు మోయుచున్న శ్రీ అరవిందుల గుణగణముల నా మహారాజు గ్రహించి యాకర్షింపబడుటయు సంప్రాప్తమైనది. ఈ సంస్థానాధీశ్వరునితో ఇరువదియొక్క సంవత్సరముల చిఱుప్రాయముననే విదేశములో శ్రీ అరవిందునికి పరిచయము గలుగుట నిజముగా నీశ్వరనిర్దేశమే! బరోడా మహారాజువద్ద నుద్యోగము సంపాదించుకొని పదునాల్గు సంవత్సరములు విదేశవాసము చేసినతరువాత ౧౮౯౩-వ

సంవత్సరమున మహారాజుతోగూడ శ్రీ అరవిందులు భరతఖండమునకు తిరిగివచ్చి బరోడాయందు జేరిరి.

ప్రథమమున మహారాజున కాంతరంగిక కార్యదర్శిగా గొంత కాలమును, రివిన్యూశాఖయందు మఱి కొంత కాలమును, ఆవల విద్యాశాఖయందు కళాశాలలో నధ్యాపకులుగాను తుదకు కళాశాలోపాధ్యక్షులుగాను శ్రీ అరవిందు లుద్యోగ మొనర్చిరి. ఇట్లుద్యోగిగా బరోడాలోనున్న కాలమున—౧౮౯౩ మొదలు ౧౯౦౬ వరకు పదుమూడు సంవత్సరములు — భారతవర్షపు విజ్ఞాన మాహాత్మ్యముగాని ఆధ్యాత్మికోన్నతస్థితిగాని శాస్త్ర సంప్రదాయములుగాని ఏమాత్రము తెలియని లోపమును శ్రీ అరవిందులు పూరించుకొనిరి. వంగదేశము నుండి యొక పండితుని బిలిపించుకొని వంగభాష నభ్యసించిరి. సంస్కృతభాషయందు గల ప్రాచీన వాఙ్మయమును మూలమునుండియే చదివి సమగ్రముగ నర్థమెఱింగి వ్యాఖ్యానము చేయగల గట్టిపాండిత్యమును దేవభాషయందు గడించిరి. గుజరాతీ, మరాటీ, హిందీ మొదలగు దేశభాషలందును కొంత పరిచయమును సంపాదించిరి. శ్రుతి స్మృతి పురాణేతిహాసాది గ్రంథముల పఠించి భారతవిజ్ఞానము నా మూలాగ్రముగ గ్రహిం

చిరి. వారి జ్ఞానపిపాస కంతము లేదు. ఆర్యావర్తపు నిజ స్వరూప మిదిగదా యని శ్రీ అరవిందులు తమ హృత్పీఠ మున జిత్రించుకొనినది యీ కాలముననే.

ఇట్లార్యావర్తపు విజ్ఞాన సభ్యతా సంప్రదాయ ముల సాకల్యముగా జాటు ప్రాచీన భారతీయ వాఙ్మయా మృతమును గ్రోలుచుండినను, అనుదినము నూతన సిద్ధాంతములను, విజ్ఞాన పరిశోధనలను, తత్త్వవిశేషము లను, శాస్త్రీయచర్చలను వెల్లడించు విదేశవాఙ్మయ పరిశోధనమునకు విశ్రాంతి నొసంగలేదు. బొంబాయి పట్టణమందలి సుప్రసిద్ధ విదేశగ్రంథ విక్రయ సంస్థాధి కారులతో-అందఅవలె ఆయాగ్రంథముల నేరి యెప్పటి కప్పుడు తెప్పించుకొనక— విదేశములలో సుప్రసిద్ధులగు గ్రంథకర్తలు రచించుగ్రంథములనన్నిటిని యెప్పటికప్పుడు తెప్పించి తనకు పంపవలసినదిగా నేర్పాటొకే పర్యా యము చేసికొనినట్లును, అందువలన వారు ముందుగా తెలుప నవసరము లేకయే అనుదినము నూతనగ్రంథముల బంపుచు మాసమున కొకసారి లెక్కల నంపి పెద్దమొత్త ముల వసూలు చేసికొనుచుండినట్లును దెలియుచున్నది. శ్రీ అరవిందుని సంపాద్య మెక్కువగా గ్రంథముల గొనుటకే వినియోగమగు చుండెడిదట.

ఇతరోన్నతోద్యోగుల నెట్లు జూచినను శ్రీ అర విందులపట్లమాత్రము మహారాజెంతో ప్రేమాదరణముల భక్తివిశ్వాసముల వెల్లడించి మిక్కిలి గారవించు చుండెడివారు. రాజ్యపాలనమునకు తిన్నగా నంత సంబంధములేని విద్యాశాఖయందు నందును స్వల్పోద్యోగమందే యున్నను వీరి నిరుపమాన ప్రతిభాసామర్థ్యముల నెఱింగినవా డగుటవలన మహారాజు తన రాజ్యపరిపాలనా సంబంధమున తఱుచు శ్రీ అరవిందునితో సంప్రతించుచుండె ననియు ప్రభుత్వనివేదికలను, ముఖ్యమైన పత్రములను, తానొసంగవలసిన ప్రధానోపన్యాసములను తయారుచేయు సందర్భములందు శ్రీ అరవిందుల సాయ మపేక్షించుచుండె ననియు నత్యవసరకార్యముల నాలోచించుటకు మహారాజభవనమునకు తఱుచు వీ రాహ్వానింపబడుచుండి రనియు తెలుపవచ్చును. అట్లాలోచించుటకు మహారాజే శ్రీ అరవిందు లుండుగృహమునకు వచ్చినదినము లెన్నియో గలవు. మహారాజు వీరి ఇంటికి వచ్చి గుఱ్ఱపుబండిలో నున్నపు డుద్యోగలాంఛనముగా డాంబికవేషమును ధరించక ఒకటే కట్టుదోవతితోడనే వారిని జూచి మాటాడుచుండెడివారు. ఒకటిరెండు పర్యాయము లుదయమున పెందలకడనే వాహ్యాళి

వెళ్లుచు నేదో యాలోచించుటకు గుఱ్ఱపుబండిలో మహా రాజుగారు దయచేయగా శ్రీ అరవిందులు నిద్రించు చుండిరట. ఆ విషయ మెట్లో మహారాజు గుర్తించి 'వారిని లేపి నిద్రాభంగము గావించరా' దని యచ్చటి వారికి గట్టియుత్తరు వొసంగి ఆవల నొకటి రెండు గంట లకు నిదురలేచిన తర్వాత తిరిగివచ్చి మాట్లాడి వెళ్లి రట. బాల్య మాదిగ చిరకాల విదేశ వాసమువలన శ్రీ అరవిందు లాలస్యముగా నిద్ర మేల్కొనుట అభ్యాస మయినది. కాని, రాత్రిపూట నందఱు నిద్రించినతర్వాత ప్రశాంత సమయమున నేకాంతముగ గ్రంథపఠన మందో వ్రాతయందో నిమగ్నులై యించుమించు రాత్రి యంతయు పనిచేయుచుండెడివారు. ఆ సుముహూర్తము నందు వారి హృదయమునుండి వెల్లివిరిసిన కవిత్వ మెం తయో గలదు.

౧౮౯౧-వ సంవత్సరమున కాబోలు బరోడాలో నుద్యోగమున బ్రవేశించిన ఏడెనిమిదేండ్లకు తన ఇరువది తొమ్మిదవ సంవత్సరమున శ్రీ అరవిందులు మృణాళినీ దేవిని బరిణయమాడి గృహస్థాశ్రమమున బ్రవేశించిరి. అప్పటికే యాధ్యాత్మికదృష్టియు నిశ్చిత కార్యసంకల్ప మును గల వీరు వివాహ మాడుటయూ మానుటయూ

యని యెంతో కాలము తర్కించుకొనుచుండినందుననే ఇంత యాలస్యముగా వివాహమైనట్లు తెలియుచున్నది. శ్రీఅరవిందుల మామగారి కుటుంబము మిక్కిలి ప్రసిద్ధమైనదే. మామగారగు భూపాలబోసు ఆకాలముననే విదేశములకేగి విద్యనభ్యసించి మాసమునకు పదునాఱువందల వేతనముతో ప్రభుత్వమునం దున్నతోద్యోగిగా నుండి తనప్రజ్ఞావిశేషముల వెల్లడించి 'రాయబహదూర్' బిరుదమును బడసినవారు. ఇపు డుపకారవేతనము నందుకొనుచు అధ్యాత్మజిజ్ఞాసువులై శ్రీఅరవిందుని పూర్ణయోగమునందు దృఢవిశ్వాసము గలవారై సాధన చేయుచున్నారు. వా రొకపర్యాయము ప్రస్తావనలో 'మున్నొకనాడు తండ్రితో సమానమగు మామగారి సంబంధమున గౌరవము బొందిన మాట యెట్లున్నను నేడు వారిని-శ్రీఅరవిందుని-తండ్రిగా, గురువర్యునిగా, భగవానునిగా గొలుచుభాగ్యము గలిగినది' యని తెలిపి తమ శిష్యత్వ సంబంధమునకు సంతోషించిరి. శ్రీఅరవింద శిష్యుడై బోసుగారు పలుమా రొంటరిగాను, ఒకటిరెండుపర్యాయములు భార్యాసహితముగాను పుదుచ్చేరి వచ్చి మాసములపర్యంత ముండి సాధన చేయుట గలదు.

శ్రీ అరవిందులు వివాహానంతరము అర్ధాంగి మృణాళినీ దేవిని, ప్రియసోదరి సరోజినీ దేవిని బరోడాకు పిలిపించుకొని కాపురము సాగించిరి. మృణాళినీ దేవి బ్రహ్మసమాజపు కుటుంబమున జన్మించి యా వాతావరణమునందు పెరిగినదయ్యు నవనాగరకపు నిగారింపులు, భేషజములు తెలియని యమాయికురా లని ధర్మాత్మురాలని వినయవతి యని యామె పరిచయము గలవా రందఱు నామెను గొనియాడుచుండిరి. కాపుర మొనర్చిన కాలమత్యల్పమయ్యు భార్యాభర్త లిరువురు నన్యోన్యప్రీతి మెయి గార్హస్థ్యధర్మము నుత్తమరీతిని నిర్వహించి యాదర్శకులుగా నుండిరని చెప్పనగును. శ్రీ అరవిందులర్ధాంగియగు మృణాళినీ దేవి గారికి వ్రాసిన యుత్తరములలో మూడింటిని ఆయాసందర్భములం దీగ్రంథమున ప్రకటించుచున్నాము. ఆయుత్తరములను బఠించినవారికి ధర్మపత్నిపట్ల వీరు ప్రకటించిన పవిత్రప్రేమ, భర్తగా వహించ నెంచిన మహాభారము, ఆమె నున్నత పథమునకు గొంపోవనెంచిన మహాప్రయత్నము, చేసినదివ్యోపదేశము లేగాక, ఎంత సరళముగా నన్యోన్యముగా వారు మెలంగుచుండినదియు తెలియగలదు.

బరోడాలో నున్నపుడు శ్రీ అరవిందులు నవసారీ

ప్రధాన మండలాధికారిగా నున్న ఖాసీరావు జాడ్వీగారి బంగళాలో రెండవయంతస్తున కాపురముండిరి. ఖాసీరావుకుటుంబము బరోడాలో నుద్యోగరీత్యానేమి సాంఘి కౌన్నత్య సంబంధముననేమి విద్యాబుద్ధులందేమి మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇచ్చటికి పురప్రముఖులు పలువురు తఱుచుగా విచ్చేయుచు శ్రీ అరవిందులతో సంభాషించుట గౌరవప్రదముగా భాగ్యముగా భావించుచుండిరి. బారిష్టరు దేశపాండ్యాగారు లండన్ పట్టణమున విద్యార్థిదశలో నుండగానే శ్రీ అరవిందునికి పరిచితులు. వీరు శ్రీ అరవిందునికడ కరుదెంచి యెన్నో విషయముల గుఱించి సంభాషించుచుండెడివారు. స్వల్పకాలము మంత్రిగా నుండిన రమేశచంద్రదత్తు, స్వామి వివేకానందుని పాశ్చాత్యశిష్యవర్గమున నుత్తమస్థాన మధిష్ఠించిన పుణ్యచరిత నివేదితాసోదరి మున్నగువారు వీరికడకు వచ్చుచుండెడివారు. శ్రీ అరవిందులు వ్యర్థసంభాషణముల నేవగించువారని అతిమితభాషి యని అనవసరపు సంభాషణల నొనర్చరని పేరున్నను, ఈ చర్చాసమయములందు వారుపయోగించుసూటిమాటలకు, వెల్లడించుసర్వతోముఖ జ్ఞానాతిశయమునకు, నిరాడంబరముగా నిర్మాణశక్తిని బ్రకటించు వారివశీకరణ వ్యక్తిత్వ విశేషమునకు,

ప్రౌఢతా చమత్కారముల నీను వారిహాస్యరసమునకు నందఱు ముగ్ధు లగుచుండెడివారట. అచ్చట నున్న పదు మూడు సంవత్సరములందును, మహారాజు మెచ్చు కోలును గౌరవాదరణములను జూరగొనిన ఉద్యోగిగా, తమ యసమాన మేధాసంపన్నతకు దగిన బోధనాకౌశ ల్యమువలన 'గురవే నమః' యని విద్యార్థిబృందము భక్తిమెయి చేయెత్తి యొనర్చిన నమస్కారముల స్వీక రించిన ఆచార్యులుగా, పురమందలి నాయకులు, విద్యార్థి కులు, పెద్దలు పిన్నలు నందఱుచే ప్రేమాభిమానములు గొనిన పౌరులుగా శ్రీ అరవిందులు కీర్తి గాంచిరి.

ఈకాలముననే బరోడాయం దుండగా బల్లపీట మూలమున చనిపోయినవారితో సంభాషించు - టేబిల్ టాక్ - నభ్యాసమును శ్రీ అరవిందులు విరివిగా సాగించి రట. వీరియందు అంతర్గర్భితమైన వీరి యాధ్యాత్మిక తృష్ణ, దేశస్వాతంత్ర్యాభిలాష వీరి నిందుకు ప్రేరేపించి నట్లు వీరు గావించిన మృతజీవుల సంభాషణావిషయ ములు సూచించగలవు. రామమోహన్, వివేకానంద, రామతీర్థ, నెపోలియన్, మాజినీ, గారిబాల్డీ మున్నగు ప్రసిద్ధపురుషుల నా బల్లపీటసంభాషణముల కాహ్వానించి యెన్నియో ప్రశ్న లొనర్చి వారిభావముల స్వీకరించ

ప్రయత్నించుచుండెడివారట. నెపోలియన్, మాజినీ, గారిబాల్డీ, గాంధారీ ధృతరాష్ట్రులు మున్నగువారి సంభాషణములు పెక్కులు పత్రికలలో ప్రకటితములై యున్నవి.

శ్రీ అరవిందులు రాజకీయరంగమున నెపుడు ప్రవేశించినదియు యోగాభ్యాస మేనాటినుండి ప్రారంభించినదియు నిదమిత్థమని చెప్పుటకు గాదు. కారణము వారు బహిర్ముఖులు గాక కేవలము నిరాడంబరమునే వాంఛించి బాహ్యప్రకటనముల నేవగించి తమ యాత్మ తృప్తికొఱకే భగవత్ప్రీత్యర్థమే ప్రతికార్యము నొనర్చు చిత్తవృత్తి కలవడినవారగుటయే. కాని యింతవఱ కంతర్గర్భితమైయున్న ఆధ్యాత్మిక రాజకీయతృష్ణ రూపు దాల్చి వారియందు నూతనపరివర్తనము గలిగింప నారంభించినది బరోడాయందే యని చెప్పనగును. స్వాతంత్ర్య తృష్ణతో పరితపించు దేశారాధకుల, పెనవేసికొని జడలుగట్టిన శిరోజములతో ఏనదీతీరమునందో పర్వత కాంతారములందో యోగాభ్యాసమొనర్చు సాధువుల, యోగుల పరిచయ మిచ్చటనే ఎక్కువగా నేర్పడినది. నిజమైన సాధుపుంగవులను, తపోధనులను, యోగీశ్వరులను దర్శించి యోగరహస్యములను యోగమాహాత్మ్య

ములను నెఱుంగవలయునను పిపాస ఇచ్చటనే గడ్డకట్టినది. తదర్థమై పరిసరప్రాంతములందున్న యోగులవిషయమై అన్వేషించుచుండెడివారు. పలుమారు నర్మదానదీతీరమున నుండిన యోగిబ్రహ్మానందస్వామిని దర్శించుటకు దేశపాండ్యాగారితో వెళ్లుచుండిరట. ఈ యోగిమహత్త్వ మసాధారణము నపారము. వారిజన్మకాల మేదియో వారివయస్సెంతో తెలియదుగాని అప్పటికి మూడు వందల సంవత్సరములకు పైగా నర్మదా నదీతీరముననే తపస్సు చేసికొనుచుండినట్లు శ్రీ అరవిందు లొకసందర్భమున వెల్లడించియున్నారు. ఈ మహాయోగి నివసించు ప్రదేశమును 'ఛందోట్' ఆశ్రమమని పిలుచుచుండిరి. ఒక సాయంసమయమున శ్రీ అరవిందు లచ్చటికి వెళ్లియుండగా ధురంధరు లనువా రొకరు తీవ్రజ్వరముతో బాధపడుచుండినట్లును, ఆవిషయ మెఱింగి బ్రహ్మానందస్వామి తన శిష్యుడగు కేశవానందుని మందీయవలసినదిగా నాదేశించినట్లును, అతడు వెంటనే ప్రవహించు నర్మదానదినుండి నిర్మలోదకమును గిన్నెడు తెచ్చి రోగి కీయగా పావు గడియలో జ్వరము పలాయనమై అతడు స్వస్థత గాంచినట్లును తెలియుచున్నది. బ్రహ్మానందస్వామి నిరంతర మంతర్ముఖులై యుందురు.

అరుదుగా సంభాషించునపుడైన శిరము వంచియే యుంచె దరు గాని తలయెత్తి చూచుట మిక్కిలి యపురూపము. అట్టి యోగిపుంగవు డొక పర్యాయము శిరమెత్తి శ్రీఅరవిందుని తేరిపారి తదేకదృష్టి నిగుడించి చూచి రనియు ఆదృష్టిప్రసారమహత్త్వమే శ్రీఅరవిందుని యం దంతర్గర్భితమై యుండిన అధ్యాత్మశక్తి కుజ్జ్వల నము గలిగించి పరివర్తన మందించెననియు తెలిసినవా రొకరు వ్రాసియున్నారు. ఈ యుజ్జ్వలనమే ౧౯౦౮-వ సంవత్సరమున విష్ణుభాస్కరలెలే యనునొక మహా రాష్ట్రయోగిమూలమున మఱింత ప్రకాశించినది.

శ్రీ అరవిందులు రాజకీయరంగమున బ్రవేశిం చినకాల మిది యని నిర్ణయించుట కష్టమైనను బరోడా యం దున్నపుడే ౧౯౦౨ మొదలు పరోక్షముగానేని కొంత రాజకీయసంబంధము గలదని చెప్పవలసియున్నది. ఉద్యోగమునం దున్నందున ప్రత్యక్షముగా రాజకీయ సభావేదికలపై నెక్కి పాల్గొనకున్నను పెక్కు దేశీయ మహాసభలకు ప్రేక్షకులుగా వెళ్లుచుండెడివా రనియు, కొన్ని సందర్భములలో తెఱచాటున తన సలహాలొసంగి సాయపడుచుండెడివా రనియు సెలవులలో వంగదేశము వెళ్లుచు నచ్చటి రాజకీయ వ్యవహారముల బరిశీలించు

మఠము', 'దుర్గేశనందిని' మున్నగు గ్రంథములలోని స్వాతంత్ర్య వీరావేశ భావములు కొంత కదలిక పుట్టించు చుండెను. వీని యన్నింటికన్న ప్రభుత్వపరిపాలనావిధానమే నాటినిరంకుశాధికారులే 'నావిష్ణుః పృథివీపతిః' యను విశ్వాసముతో రాజభక్తికి పేరుమోసిన భారతీయులను పలువిధముల పీడించి రెచ్చగొట్టిరను భావము వంగదేశమునందంతటను వ్యాపించెను. నాటిరాజప్రతినిధియగు కర్జన్ ప్రభువు తన యసమాన శేముషీ శక్తిసామర్థ్యముల నన్నింటిని దేశీయపీడనమునకు వినియోగింప నారంభించెను; 'రిప్పన్' ప్రభువు నాడు నెలకొల్పిన స్థానిక (మునిసిపల్) పరిపాలనాపద్ధతికి వ్యతిరేకముగా కలకత్తా మునిసిపల్ పరిపాలనమును విధ్వంస మొనర్చెను. విక్టోరియా మహారాణి వాత్సల్యముతో ప్రసాదించిన ఉదార ప్రకటనమున కపార్థము గావించి భారతీయుల కాశాభంగము గావించెను. 'సత్యం వద' యను శ్రుతివాక్య ప్రమాణమునకు కీర్తిగాంచిన భారతపుత్రులను ఈ రాజనీతి తంత్రజ్ఞుడు అసత్యవాదు లని జంకు గొంకు లేక పరిహసించి యవమానించెను. 'విభజించి పరిపాలింపుము' 'చీలదీసి చెండాడుము' అను రాజనీతిని సంపూర్ణముగా గ్రహించి వంగదేశీయు లందఱు నైకకంఠ్యముతో

'వలదు వలద'ని బతిమాలి మొఱబెట్టు కొనినను నిర్ల క్ష్యముగా నిరంకుశముగా వంగదేశమును రెండు భాగ ములుగా విభాగింప కృత నిశ్చయు డాయెను. దీనికి ప్రతీకారముగా ౧౯౦౫ ఆగస్టునెల తే ౭ దీని వంగీయు లందఱును మహాసభ యొనర్చి విదేశవస్తుబహిష్కార వ్రతమును బూన నిశ్చయించిరి.

## గుప్త వాక్యము

ఈ సమయముననే, అనగా ఆగస్టు తే ౩౦ దీని శ్రీ అరవిందులు తమధర్మపత్ని మృణాళినీ దేవిగారికి వ్రాసిన అద్భుతలేఖ నీక్రింద బొందుపఱచుచున్నాము. భారతమాత దాస్యస్థితికి వీ రనుభవించిన హృదయ పరి వేదన, కేవల మాత్మశక్తితోడనే పశుబలము నెదుర్కొని జయముగాంచ నగునను వీరి విశ్వాసము, సర్వము మాత కర్పించ వలయు నను వీరి త్యాగదీక్ష, ఈశ్వర సాక్షాత్కారము నందితీరవలెనని వీ రొనరించిన ప్రయ త్నము, దేశోద్ధరణ మను మహావ్రత సాధనమునకయ్యే త మ్మీలోకమునకు భగవానుడంపెనను వీరియాత్మ విశ్వాసము కేవలము గుప్తవాక్యముగా శ్రీఅరవిందులు వ్రాసిన ఈయుత్తరమున స్పష్టమగుచున్నది.

బరోడా,
30. ఆగస్టు, ౧౯౦౫.

ప్రియ మృణాళినీ!

ఆగస్టు ౨౪-వ తేదినాటి నీయుత్తర మందినది. నీ తలిదండ్రులకు మరల నిట్టివిపత్తు ఘటిల్లినందులకు చాల చింతించుచున్నాను. ఏబిడ్డ పరలోకమున కరిగెనో వ్రాసితివి కావు. దుఃఖమే వాటిల్లినది; అయిన నేమిచేతుము? ప్రపంచమందు సుఖమును వెతుకబోతిమేని సుఖమందే దుఃఖమును గాంతుము. దుఃఖ మెల్లపుడు సుఖము నంటియేయుండును. ఈ దృశ్యము పుత్రవాంఛ గలవారికి తోచుననిగాని వారిపట్లనే ఈ నియమము చెల్లుననిగాని తలపరాదు. సమస్త ప్రాపంచిక వాంఛల ఫలము నిట్లే తేలును. ధృతివిడువక, తనసుఖదుఃఖముల నన్నిటిని జగదీశుని చరణతలమున నర్పణ మొనరించుటే మానవుని చేతియందలి నెరవు.

ఇరువదిరూపాయ లని కాక పదిరూపాయ లని చదివితిని. అందుచే పదిరూపాయలు పంపెద నంటిని. పదునేను రూపాయ లవసర మనుచో ఆమొత్తమునే పంపెదను. ఈనెలలో నీకొఱకై సరోజిని డార్జిలింగులో బట్టలు కొనినది. వానికైన పైక మంపితిని. నీవిచోట అప్పుచేసికొని కూర్చుంటివని ఎట్లెఱుంగుదును? పదునైదురూపాయలు బదులు తీర్చవలెనుగాన ఆపైకమును బంపినాను. మఱి మూడు నాలుగు

రూపాయ లసును. వానిని వచ్చే నెలలో పంపెదను. నీ కీమారు ఇరువదిరూపాయల నంపెదను.

ఇక నామాట జెప్పెదను. ఎవని భాగ్యముతో నీ భాగ్యము మిళితమైయున్నదో యాతడు బహువిచిత్రపురుషుడను నంశమును నీవింతలో గ్రహించియుందువు. ప్రస్తుత మీ దేశమున నుండు పురుషుల కేవిధమగు మనోభావములు, జీవనోద్దేశములు, కర్మక్షేత్రములు గలవో నాకుమాత్ర మవి యారూపమున లేవు. నాకు సకలవిషయములు భిన్నమై, అసాధారణమై యుండును. అసాధారణమనస్సు, అసాధారణోద్యమము, అసాధారణోచ్చాశ — వీని నేమి యందురో నీవు తెలిసి యుందువు. ఈసమస్తభావములనే వెఱ్ఱి యందురు. అయినను కర్మక్షేత్రమున సఫలత్వముం బొందిన నాతని వెఱ్ఱివాడనక ప్రతిభాపూర్ణుడగు మహాపురుషు డందురు. కాని ఎందఱి ప్రయత్నము సఫలీకృత మగును? మానవసహస్రంబున నే పదిమందియో అనన్యసాధారణు లుందురు. ఆ పురుషు లందొక్కడే కృతకృత్యు డగును. నాకర్మక్షేత్రమున సఫలత్వము నొందుట కడుదుస్తరము; సంపూర్ణభావమున కర్మక్షేత్రమునం దింకను బ్రవేశింపజాలనైతిని. అందుచే నన్నున్మాది ననియే గ్రహించెదవు. ఉన్మాదునిహస్తమునం బడుట స్త్రీలపక్షంబున నమంగళమే. ఏలనన నారీగణముయొక్క సమస్తాశలు సంసారసుఖదుఃఖములయందు నాబద్ధమైయుండును. వెంగలి తనపత్నికి సుఖమీయక సర్వదా దుఃఖముల పాల్సేయును.

హిందూధర్మప్రణేత లీయంశమును జక్కగ దెలిసికొనిరి. అసామాన్యచరిత్ర, ఉద్యమము, ఆశాప్రభృతుల

నతిశయముగ నాదరించెడివారు. ఉన్మాదియైన, మహాపురుషుడైన నసాధారణవ్యక్తిని వారత్యధికముగ గౌరవించెదువారు. కాని యీ సమస్తములో భార్య దుర్దశ కేమి యుపాయము? ప్రాచీనమునిగణ మీ సదుపాయము నేర్పఱచిరి. "'పతిః పరమో గురుః' అను మంత్రము స్త్రీజాతి కేకమాత్ర మని గ్రహింపుడు" అని.

పత్ని పతికి సహధర్మిణి. అత డేకార్యమును స్వధర్మమని యవలంబించునో దానికి సహాయము చేయవలెను. ఆలోచన మీయవలెను, ఉత్సాహపరచుచు దేవతాన్యాయమ్ముగ మన్నన సేయుచుండవలయును. అతనిసౌఖ్యమే తనసౌఖ్యమనియు నాతనిదుఃఖమే తనదుఃఖమనియు మెలగుచుండుట అబలలకర్తవ్యము. కార్యము నిర్వహించుట పురుషుని యధికారము; సాహాయ్యము నుత్సాహము నొసగుట స్త్రీయధికారము.

ఇపుడు ముఖ్యవిషయ మిది. నీవు హిందూధర్మపథము నవలంబించెదవా? లేక నవీనసభ్య ధర్మపథ మవలంబించెదవా? అవివేకిని వివాహ మాడితివి. ఇది నీ పూర్వజన్మార్జితకర్మదోషము యొక్క ఫలము. నిజభావిదశనుగుఱించి యేదేని యేర్పాటు చేసికొనుట మేలు. అ దేవిధమున? నల్గురి మతానుసారముగ నీ వాతని నున్మాదియని తిరస్కరించెదవా? ఉన్మాది తన యున్మాదమునంబడి పరుగులిడుచునేయుండును. నీ వాతనింబట్టి యాపజాలవు. నీకన్న నాతనిస్వభావమే బలవత్తరము. అట్లయిన నీవు గృహకోణమున నుపవిష్టవై యార్తనాదము సేయుచుందువా? లేక యాతని ననుసరించెదవా? ఏవిధముగ నంధుడగు ధృతరాష్ట్రునిపత్ని స్వచక్షుర్ద్వయమును వస్త్ర

మూలమున బంధించి తానే యంధులా లయ్యేనో యారూప మున నీవు నీవెంగలి కనుమూలముగ నున్నాదినివి గమ్ము. నీ వెన్ని బ్రహ్మసమాజ విద్యాలయములందు బఠించియుండినను నీవు హిందూవంశసంభూతవనుట మఱువకుము. పూర్వపు హిందూ ఋషులరక్తము నీశరీరమున బ్రవహించుచున్నది. శేషోక్త పథము నవలంబించెదవని నా గట్టినమ్మకము.

నాకు మూడువిధములగు పిచ్చిసందేహము లున్నవి. నా ప్రథమభావ మిది. ఈశ్వరుడే గుణములు, ఏప్రతిభ, ఏయుత్తమవిద్య, ఏధనము మొదలగునవి యన్నియు బ్రసాదించెనో యాసమస్తము నాస్పృష్టికర్తవే. ఏవి సంసారభరణ పోషణార్థ మావశ్యకమో ఏవి యత్యంతావశ్యకమో యవి తననిమిత్తము వ్యయపరుప నధికారము కలదు. శేషించిన వస్తువుల మరల నా సత్యసంధున కిచ్చుటయే యుత్తమము. ఏను సర్వము స్వకీయార్థమై సుఖవిలాసములకొఱకు వ్యయపఱచినచో నేను చోరుడను. భగవంతునికడ నెవడు ధనము గ్రహించి యీశ్వరునకు మరలనీయడో వాడు తెక్కలి కాడని హిందూశాస్త్రము వాకొనుచున్నది. ఇంతపర్యంతము నీశ్వరునకు రెం డణాలుమాత్ర మిచ్చి పదునాల్గణాలు నానిమిత్తము వ్యయపఱచి యొకవిధముగ సంసారసుఖమందు మత్తుండనై యుంటిని. అర్ధాంశజీవనము వ్యర్థమైపోయినది. పశువులు గూడ తమతమపరివారముల యుదరపోషణమున గృతార్థత జెందియుండును.

నే నింతకాలము పశువృత్తి మఱియు చౌర్యవృత్తి నవలంబించియుంటి నని ఇపుడు గ్రహించితిని. తెలిసికొని

నాయెడ నొకవిధమగు ఘృణఃభావముగల్గి యనుతప్తుడనైతిని. ఇక వలదు. ఆపాప మీజన్మమునకు త్యజించితిని. ఈశ్వరున కిచ్చుటయన ధర్మకార్యములందు వ్యయపఱచుటయే. సరోజి నికిని, ఉషకును సైకమిచ్చితినని మనసున పశ్చాత్తాపపడుట లేదు, పరోపకారము పరమధర్మము. ఆశ్రితుల గాపాడుట పరమధర్మము. అక్కచెల్లెండ్రకును, అన్నదమ్ములకును మాత్రమే యిచ్చిన లెక్కతీరిపోదు. ఈదుర్దినమున సమస్తదేశము నాద్వారము నాశ్రయించియున్నది. నా ముప్పదికోట్ల సోదరీ సోదరు లీ దేశమున గలరు. వారిలో ననేకు లనాహారమున మృత్యుముఖమున బడుచున్నారు. అధికాంశులు దుఃఖకష్ట ములకు బాల్పడి యొకవిధముగ జీవితులుగ గన్పట్టుచున్నారు. వారిహితము నన్వేషించుచుండుట నాధర్మము.

ఏమందువు? ఈవిషయమున నీవు నా సహధర్మిణి వగు దువా? మిగుల సామాన్యునివలె నాహారవస్త్రములనంది, తప్పని సరిగ నేమి యావశ్యకమో వానినే స్వీకరించి, సర్వస్వము నా నిర్వికారునకు సమర్పించుటయే నా యభీష్టము. నీ వంగీక రించిన నీవు త్యాగము చేయగలిగిన నావాంఛ పూర్ణము గావచ్చును. "నే నెట్టియున్నతిని గనజాలనైతిని" అని నీవు చింతించియుంటివి. ఈ యున్నతపథమును జూపితిని. దీని ననుసరించెదవా?

రెండవ పిచ్చిభావము నామనసు నిపుడు గట్టిగ నావ రించియున్నది. ఏవిధముననైన నీశ్వరసాక్షాత్కారము నంది తీరవలెను. ప్రస్తుత కాలధర్మము ఈశ్వరనామమును మాటి మాటికి నోట నుచ్చరించుట, సకలమానవుల సమక్షమున

ప్రార్థనసలుపుట, లోకమునకు నేను ధార్మికుడను గానా యని నిరూపించుట; ఇది నాకు వలదు. ఈశ్వరు డున్నచో నాతని యస్తిత్వము ననుభవించుటకును, ఆయనను దర్శించుటకును ఎద్దియో యొక పథ ముండును. ఆపథ మెంత దుర్గమ మైనను నన్వేషించుటకు దృఢసంకల్పుడనై యుంటిని. హిందూధర్మ మున నిజశరీరమున మార్గమున్నదని చెప్పబడినది. పోవుదారి జూపబడియున్నది. వాని నన్నింటిని ఆచరించుట నారంభించితిని. ఒకమాసములో వాని ననుభవమునకు దేగల్గితిని. హిందూధర్మసంగతి యబద్ధముగాదు. ఏయేచిహ్నముల నిది యుల్లేఖించెనో వాని నన్నింటిని బొడగాంచుచుంటిని. ఇపుడు నిన్ను గూడ నాపథమునకు దోడ్కొనిపోవుట కత్యంత వాంఛితుడ. వెంటనే వొంటరిగ నడువజాలవు. ఏలనన నీ కంతజ్ఞాన మింకను రాలేదు. కాని నా వెంబడించివచ్చిన నేయాటంకము లేదు. ఆమార్గమం దందఱు సిద్ధినందగలరు. ప్రవేశించుట మాత్రము నీ యభివాంఛయం దాధారపడియున్నది. ఎవరును నిన్ను బలవంతముగ బట్టి తీసికొనిపోజాలరు. నీ కిష్టమున్నచో దానివిషయము స్పష్టముగ వ్రాసెదను.

మూడవ యున్మాద మిది. ఏ యితర మానవులందఱు స్వదేశము నొక జడపదార్థము, కొంతభూమి, క్షేత్రవన పర్వతనదీసమానమని భావించుచుందురో దానిని నేను జననీ రూపమున తలంచుచుందును. భక్తితో బూజసల్పుదును. మాతృవక్షమున నుపవిష్టుడై యొకనిశాచరుడు రక్తపానముం జేయుట కుద్యమించిన బుత్రు డేమిసేయును? నిశ్చింత భావమున నాహారము భుజించుచు, ఆలుబిడ్డలంగూడి, యామోద

ప్రమోదములయందు మత్తుడైయుండునా? లేక మాతను రక్షింప సమకట్టునా? ఈపతితజాతి నుద్ధరించుబలము నాయందున్నది. అయ్యది శరీరబలము కాదు. అస్త్ర శస్త్ర శతఘ్ని మూలమున నేను రణరంగమునకు బోవుటలేదు, జ్ఞానబలముతో. క్షత్రియతేజము ఏకమాత్రతేజము గాదు. బ్రహ్మతేజముగూడ నున్నది. ఆతేజము జ్ఞానములో సుప్రతిష్ఠమై యున్నది. ఈభావము నూతనముగాదు. ఈనాటిదియుగాదు. ఈభావముతో నేను జన్మించియుంటిని. ఈభావము మజ్జాగతము. దైవమీ మహావ్రతసాధనమునకై యీ లోకమునకు నన్నంపియుండె. చతుర్దశవర్షప్రాయమునుండి బీజమంకురింపదొడంగె. అష్టాదశప్రాయమున నా ప్రతిష్ఠ దృఢమై యచలముగా నారంభించెను. నీవు పినతల్లిపలుకులు విని 'ఎచ్చటినుండియో యీదుష్టమతివచ్చి నాసరళస్వభావుడగు స్వామిని కుపథమునకు లాగుకొనిపోవుచున్నా'డని భావించియుంటివి గదా? నీపతి ఆమానవుని మఱియు నూర్లకొలది మానవులను ఆమార్గమున — కుపథముననో సుపథముననో — ప్రవేశపఱచె. మఱియు వేలకొలది మర్త్యుల బ్రవేశింపజేయును. నా జీవితములో కార్యసిద్ధియగునని నేను దృఢముగ వక్కాణించుటలేదు. కాని నిశ్చయముగ ఫలించును.

నీ వీవిషయమున నేమిచేసెదవు? పత్ని పతియొక్క శక్తి. నీవు ఉషకు శిష్యురాలవై పాశ్చాత్యుల పూజామంత్ర జపతపముల నాచరించెదవా? ఉదాసీనవై భర్తయొక్క శక్తిని నశింపజేసెదవా? లేక సహానుభూత్యుత్సాహముల ద్విగుణము చేసెదవా? "ఈ సమస్తమహాత్కార్యములయందు నావంటి

సామాన్యస్త్రీ యేమిచేయగలదు? నాకు మనోబలములేదు" అని భావించుచు భయము నొందుచుందువా? దానికి సులభోపాయ మున్నది. ఈశ్వరుని యాశ్రితవు కమ్ము. ఈశ్వర ప్రాప్తిపథమున నొకపరి ప్రవేశింపుము. నీకేమి యభావముగ నున్నవో వాని నన్నింటిని నాతడే శీఘ్రముగ బూర్ణము సేయును. ఎవరు భగవంతుని యాశ్రితు లయ్యెదరో వారిని భయము క్రమక్రమముగ విడిచివెడలును. నాయెడ విశ్వాసమున్న బరులమాటలు వినక నామాట నేవినిన నేను నీకు నా బలము నియ్యగలను. అందున నాబలమునకు హాని సంభవించక వృద్ధియేపొందును. భార్య భర్తయొక్క శక్తియని తెలిసికొనుము. పతి పత్నియందు స్వరూపప్రతిమూర్తిం గాంచి యామెకడ దన మహదాకాంక్షా ప్రతిధ్వనిని విని ద్విగుణశక్తిని బొందును.

చిరకాల మీవిధముననే ఉందువా? "నేను మంచి వస్త్రముల ధరించెద; మంచిపదార్థముల భుజించెద; హాసించెద; ఖేలనముచేసెద; అనేకవిధములగు సుఖముల ననుభవించెద"—ఈవిధముగ తలపోసెదవా? ఇట్టితలంపును ఉన్నతి అనరు. ప్రస్తుతము మనదేశనారీబృందజీవన మతిసంకుచితమై హేయమై శోచనీయాకారము ధరించినది. నీ వీయాకారమును విసర్జింపుము. నాతోరమ్ము. భగవంతునికార్యము సల్పుటకై ఈజగత్తునకు విచ్చేసితిమి. ఆకర్మ నారంభింతము.

నీస్వభావమునం దొకదోష మున్నది. నీవత్యంత సరళ ప్రకృతి గలదానవు. ఎవరెద్దిచెప్పిన నద్దాని నమ్మెదవు. అందువలన మనస్సు సర్వదా యస్థిరముగనుండు. బుద్ధి వికాసము

నొందదు. ఏకార్యమునందు నేకాగ్రత యుండదు. నీవీ లోప
మును బోగొట్టుకొనవలెను. ఏయొక్కరిమాటయో విని జ్ఞానా
ర్జనము సేయవలయును. ఒకదానియందే లక్ష్యముంచి యచలిత
చిత్తమున కార్యసాధనము జేయవలయును. లోకనిందావిద్రూ
పముల దుచ్ఛముగా నెంచి స్థిరభక్తి నుంచవలయును.

మఱియొకదోష మున్నది. అయ్యది నీస్వభావదోషము
గాదు, కాలదోషము. వంగదేశమం దిట్టికాలపరిణామ మేర్పడి
నది. గంభీరవిషయముల గంభీరభావమున వినజాలకున్నారు.
ధర్మము, పరోపకారము, మహదాకాంక్ష, మహదుద్యమము,
దేశోద్ధరణము, ఏదిగంభీరమో, ఏదియున్నతియో, ఏది మహ
త్తరమో ఆసమస్తమును బరిహాసవిద్రూపముల సేయుదురు.
పరిహాసమున నెగురగొట్టెదరు. బ్రహ్మసమాజవిద్యాలయమున
నుండుటచే నీకాదోషము కొంచెమున్నది. వరేంద్రునికి గూడ
నుండెడిది. అల్పపరిమాణమున మనమందఱము నీదోషమున
దూషితులము. దేవఘరమందలి ప్రజలలో నాశ్చర్యకరముగ
నిది పెరిగిపోయినది. ఈ మనోభావము దృఢమనమున విడువ
వలెను. నీ వది సహజముగ జేయగలవు. మఱియు నొకపరి
చింతించుటయం దభ్యాసము చేసిన నీపూర్వస్వభావము
ప్రస్ఫుట మగును. పరోపకార స్వార్థత్యాగములందు నీ
హృదయ మున్నది. కేవలము నీమనోబలమే యభావము.
ఈశ్వరోపాసన సలిపిన తిరిగి యాబలము సంప్రాప్త మగును.

ఇదియే నాగుప్తవాక్యము. ఎవరికడ బ్రకాశపఱుపక
ధీరచిత్తమున చింతించుచుండుము. ఇందు భయపడుట కేమియు
లేదు. కాని చింతింపవలసినవిషయము లనేకము లున్నవి.

తొలుదొలుత నేమియు చేయ నవసరము లేదుగాని ప్రతిదిన మొక యరగంట నే నీశ్వరధ్యానమున మగ్నమైయుండవలెను. ఆయనకడ ప్రార్థనారూపమున బలవతికావలె నను వాంఛ ప్రకాశపఱుపవలెను. క్రమక్రమముగ స్వాంతమందు సిద్ధమగుచు సర్వదా యాతని నీవిధమున బ్రార్థించుచుండవలెను. "నేను నా ప్రాణనాథుని జీవనోద్దేశమును ఈశ్వర ప్రాప్తి పథమునుండి మఱల్చక సర్వకాల సర్వావస్థలయందు సహాయురాలనై సాధనభూత ననుదునుగాక"! ఇదియే చేయుచుండుము.

ఇట్లు

నీపతి.

తుదకు ౧౯౦౫ అక్టోబరు తే ౧౬ దీని వంగ దేశవిభజనము శాసనమై యములులోనికి వచ్చెను. ఈ విభజనమును రద్దు గావించి తీరవలయు నని 'రక్షా' బంధనము ధరించి దీక్షవహించని వంగీయుడు లేనంతటి తీవ్రోద్రేకము లుదయించెను. ఈ యుద్రేకమే నూతనోద్యమముగా రూపుదాల్చి ఆర్యావర్తమున కంతకు నెగ బ్రాకినది. ప్రజలు తమ వ్యతిరేకాభిప్రాయముల నానా రూపముల వెల్లడించుకొనలదియు ప్రభుత్వము వారు నిర్బంధశాసనములను బ్రయోగించ నారంభించిరి.

శ్రీ అరవిందు లీసమయమున నాటి స్థితిగతుల యథార్థ రూపమును స్వయముగా నెఱుంగుటకు వంగదేశమునకు వచ్చియుండెను. ప్రభుత్వమువా రేసంకల్పముతో వంగ దేశమును రెండుగా విభజించి విడగొట్టినను ప్రజలలో మాత్రము తీవ్ర ప్రతిక్రియ లొనర్చుటకు కని విని యెఱుంగని యేకీభావ మేర్పడినది. అందుననే మితవాద నాయకుడగు గోపాలకృష్ణ ఘోక్లే యాధిపత్యమున కాశీ పట్టణమున ౧౯౦౫-వ సంవత్సరమున డిసెంబరు మాసమున సమావేశమైన దేశీయ మహాసభయందు ప్రభుత్వమువారి నిర్బంధచర్యలను ఖండించుచు 'వంగదేశమును విభజించిన విపరీతచర్య కాస్థితిలో ప్రతీకారముగా వంగీయు లవలంబించిన బహిష్కారోద్యమము న్యాయము సమర్థనీయము' నను తీర్మాన మేకగ్రీవముగా నంగీకృతమైనది. దేశమం దంతటను ప్రతిదినము సభలతో తీర్మానములతో నిండిపోయెను. వందేమాతరమను ధ్వనులు మిన్ను ముట్టుచుండెను. బహిష్కారాయుధ ప్రయోగము ముఖ్యముగా బారిసాల్ మండలమునందు విషమదశను తెచ్చిపెట్టినది. ఆ సమయమున ౧౯౦౬-వ మార్చిలో నచ్చట సమావేశమైన వంగరాష్ట్రీయ మహాసభ అధికారుల ఆగ్రహమునకు బలియైనది. పలువురు

ప్రతినిధులను సేవాదళమును లాఠీలతో ప్రహరించిరి. మండలాధికారి యగు ఎమర్సుదొర సురేంద్రనాథు నంతటి మితవాదిని, 'వంగదేశమునకు కిరీటములేని చక్రవర్తి' యని బిరుదమందిన నాయకుని, అవమాన పఱచి, పైపెచ్చు కోర్టు ధిక్కారమును నేరారోపణ మొనర్చి రెండువందల రూప్యముల యపరాధమును విధించిరి. ఆ సభకు బారిసాలు వెళ్లియుండి యీబీభత్సప్రదర్శనమును స్వయముగా జూచివచ్చిన శ్రీ అరవిందులు బరోడాలో నొక బహిరంగోప న్యాసమునందు నాటి విషమస్థితిని వివరముగా వెల్లడించి యుండిరి. దేశీయులు కన్నతల్లిని 'వందే మాతర' మని యెలుగెత్తి స్మరించుట నమస్కరించుటయే నేరముగా పరిగణించబడెను. విద్యార్థులు సభలకే వెళ్లరాదని నిషేధపుటుత్తరవులు సృష్టింపబడెను. ఈవిషాదదృశ్యమును గండ్లార జూచిన శ్రీ అరవిందులకు, వంగదేశమున కొదవిన యుత్పాతము, నపు డుద్భవించిన నూత నోద్యమము కేవలము పాలితపాలకసంఘర్షణోద్భవము గాక ఈశ్వరనిర్దేశ మని ఆధ్యాత్మికదృష్టితో విశ్వసించిన శ్రీ అరవిందులకు వంగమాతయాక్రందన మాహ్వానమయి హృదయవిదారణము గావించినది. ఈహృదయ

వేదనమం దుద్భవించిన 'తల్లియాహ్వానము నందికొని సేవ చేయుము' అను అంతర్వాణి యాదేశము నాలకించి కాబోలు ౧౯౦౬ జూలై నెలలో శ్రీ అరవిందులు బరోడాకళాశాలలోని తొమ్మిదివందల రూప్యముల మాసవేతనములోనున్న ఉపాధ్యక్షపదవిని తృణప్రాయముగా ద్యజించి వంగదేశమునకు వచ్చిచేరిరి !



# శ్రీ అరవింద జీవితము

## మూడవ తరంగము

### జాతీయవిద్యాసంఘము — తత్సంబంధము

వంగదేశము నావరించుచుండిన నూతనోద్యమ నిరంకుశ పరిపాలనసంఘర్షణాసంజనితములగు స్వదేశీ - బహిష్కారములను సమగ్రముగా సాగించుటకు, ప్రభుత్వపాఠశాలలకు ప్రత్యామ్నాయముగా జాతీయ విద్యాలయములను నెలకొల్పవలయు నను సంకల్పము జాతీయవాదుల కుదయించి తత్ప్రయత్నము లారంభ మాయెను. ప్రభుత్వవిద్యావిధాన మిహపరదూరమై కేవలము విదేశప్రభుత్వమున కూడిగము చేయుటకు వలయు నుపకరణములను తయారుచేయు ఖార్ఖానాలుగా వారి విద్యాలయములు పరిణమించుచున్నవను భావము వ్యాపింపజొచ్చెను. విద్యావంతుల కుద్యోగము లిచ్చి

తృప్తిపడుపజాలకనో, జీవనాధారము లేక యాశాభంగ ముతో, తన్మూలమున గలుగు ద్వేషభావముతో, ప్రభుత్వమువారిపై దేశీయుల నుసికొల్పుచున్నా రని విద్యావంతులను శాంతపఱచి యూరడించి సానుభూతి నందుటకో, మఱేకారణముచేతనో, నేడు ప్రభుత్వవిద్యావిధానము లోపభూయిష్ఠ మని పరివర్తన మవసర మని ప్రభుత్వోద్యోగులుకూడ విమర్శించుట పరిపాటియైనది గాని నాడుమాత్రము జాతీయవాదులే విజాతీయవిద్యావిధానమువలని యనర్థములను గుర్తించి తన్నివారణోపాయముల నారయ నారంభించియుండిరి.

ఆంగ్లభాషామూలమున చరిత్రము, శాస్త్రము, సర్వము బోధించుట కాలహరణ మని, బాల్యవయస్కులగు విద్యార్థుల మనోబుద్ధులు శరీరపాటవములు నశించి యెందుకును గొఱగాకపోవుచున్న వని, మాతృభాషల లోనే విద్యాబోధన మొనర్పవలెనని పక్షభేదములు లేక దేశీయు లందఱు నంగీకరించసాగిరి. ఇందులకు తోడు విద్యార్థులు రాజకీయసభలకు బోరాదను నిషేధపుటుత్తరువులు తీవ్రరూపము దాల్చినవి. ఈవిషయమై బెంగాలుప్రభుత్వ కార్యదర్శియగు కార్ లైల్ దొరగారు రహస్యపుతాఖీదులను మండలాధికారులకు బంపుటయు,

రంగపూరుమండలాధికారి యామండలములోనియున్నత పాఠశాలావిద్యార్థులు రాజకీయసభకు హాజరైరని ఎను బదియారుగురు విద్యార్థులకు ఐదేసిరూప్యములవంతున నపరాధము విధించుటయు నంత నాపాఠశాలలోని బాలు రందఱును సుమారు మూడువందలమంది నమ్మెకట్టు టయు దత్ఫలితముగా నాలుగైదు దినములలోనే మొట్టమొదట జాతీయపాఠశాల స్థాపిత మైన దను అసమానగౌరవ మామండల మందుటయు నాటిరాజ కీయచరిత్రను దిలకించిన తెలియగలదు. ఉడుకురక్త ముతో నుత్సాహోద్వేగములతో సభలకు హాజరైన బాలురను విద్యార్థులను నానావిధముల శిక్షించి, తుదకు వారి భావిజీవితమునకే భంగము గలుగునట్లు ప్రభుత్వ పాఠశాలలో ప్రవేశించి విద్యాభ్యాసము చేయరాదని కఠినశాసనము గావించి, పాఠశాలలనుండి వెడలగొట్ట నారంభమాయెను. ఇట్లిందఱో వందలకొలది వెడలగొట్ట బడిన విద్యార్థు లూరక తిరుగాడుట దేశానర్థదాయక మగునేమో యని పెద్ద లందఱును గుర్తించిన ఫలమే జాతీయ విద్యాసంఘు స్థాపనము. సర్. గురుదాస బెనర్జి, రసవిహారిఘోషు, భూపేంద్రనాథబోసు, డాక్టరు నీలరత్న సర్కారు మున్నగు ప్రముఖులు సుమారు ముప్పదిమంది

పరిపాలనా సంఘసభ్యులై సంఘోద్దేశ విధానములను దెలుపుచు ప్రణాళికను బ్రకటించిరి. కలకత్తాలో జాతీయ కళాశాలను ౧౯౦౬ నవంబరు ౧౬-వ తేదీని స్థాపించిరి. ఈకళాశాలకు ప్రధానాచార్యులుగా నుండి సాయపడ వలసినదిగా నై విద్యాసంఘమువారు శ్రీఅరవిందుల నాహ్వానించిరి. భరతమాత సేవ చేయుటకే సర్వము త్యాగమొనర్చి సిద్ధముగానుండిన శ్రీఅరవిందులు, నేటి బాలురే విద్యార్థులే నిజమైన జాతీయవిద్య నభ్యసించి తన్మూలమున విజ్ఞానవంతులై శక్తిమంతులై దేశభక్తులై మాతృదేశము నుద్ధరించు భావిపౌరులు గాగలరని విశ్వసించుచుండిన శ్రీఅరవిందు లీయాహ్వానమును వంగమాత యాదేశముగా నంగీకరించి యత్యల్ప- డెబ్బదైదు రూపాయలని పేరు, అదియు సొంతముగా స్వీకరించినట్లు లేదు- గౌరవభృతితో నాచార్యపదవిని స్వీకరించిరి.

సుబోధచంద్రమల్లిక్ ప్రప్రథమమున, తా నంత శ్రీమంతుడు గాకున్నను, లక్షరూపాయ లా విద్యాసంఘమున కిచ్చి మార్గదర్శి యాయెను. మఱొక శ్రీమంతుడిరువదివేల వార్షికాదాయము లభించు స్థిరచరాస్తులను సమర్పించెను. వేఱొక శ్రీమంతుడు రెండులక్షలరొక్కమును కలకత్తాలో నొక ద్రవ్యభవనమును దాన మొన

ర్చెను. ఇట్లు శ్రీమంతు లుదారులై భూరివిరాళము లొసం
గుటవలన ప్రతిసంవత్సరము ఏబదివేల రూపాయ లాదా
యము వచ్చు మూలధన మేర్పడి విద్యాసంఘమున కార్థిక
బలము చేకూరినది. కాని శ్రీఅరవిందుల సేవాభాగ్యము
మాత్ర మాకళాశాల కెక్కువకాలము లభించినదిగాదు.
విద్యాసంఘమును పాలించు నధికారము కైవసము చేసి
కొనిన మితవాదులకు-విజాతీయవిద్య నభ్యసించి ప్రభు
త్వోద్యోగమున పాశ్చాత్య వ్యామోహమున బుట్టి పెరి
గిన పెద్దలకును- శ్రీ అరవిందులకును ఆదర్శవిధానము
లందు భిన్నభావము లేర్పడి పొత్తుగుదిరినదికాదు. ఆధ్యా
త్మికముగానేమి భౌతికముగానేమి ప్రపంచమునకు
నాయక మణిగా నుండిన భరతమాతయొక్క తొల్లింటి
వైభవస్వరూపమును హృత్పీఠమున జిత్రించుకొని
యూహాగానముచేసినది జాతీయవాదులు. విజాతీయ
సంపర్కమువలన నానావిధములను చెడి యేర్పడిన దేశ
దారిద్ర్యమునకు భావదాస్యమునకు దురపిల్లి దేశమును
పునరుద్ధరించుటకు దీక్షవహించి సర్వము త్యాగమొనర్చి
బలిగా నిశ్చయించినది జాతీయవాదులు. వీరి మనోభావ
ములం దుండియే యుద్భవించి, వీరి నిరంతరప్రయత్న
మువలననే రూపు దాల్చిన జాతీయవిద్యాసంఘమునందు

తమ యాదర్శానుగుణముగా వ్యవహారముల నిర్వహించుటకు స్వాతంత్ర్యము లేకపోవుటయు ధనవంతులను కారణముచే జాతీయవిద్యాస్వరూపమునే యెఱుంగని ఇతరులు సర్వాధికారము చెలాయించుటయు సంభవించినది. స్వాతంత్ర్యమును గోల్పోయిన దేశమం దిట్టి విషమదశ పరిపాటియగుటలో వింత లేదు.

శ్రీ అరవిందుల జాతీయవిద్యాదర్శము మహోత్తమమైనది. వేదకాలపునాటి 'విద్యా'పద నిర్వచనమునకనుగుణమై, ఆధునిక ప్రపంచ భౌతికవిజ్ఞాన సమ్మిళితమై, భుక్తిముక్తిదాయకమై యమోఘమైనది. అంతస్స్థితమై యున్న ఈశ్వరత్వమును బాహ్యజీవితమందు ప్రస్ఫుటమొనర్చి భగవల్లీలావిలాసమును బరిపూర్ణమొనర్చుటయే విద్యవలని మహత్తమప్రయోజన మని శ్రీఅరవిందులు వెల్లడించియున్నారు. జాతీయవిద్య, జాతీయవిద్యాపద్ధతులను గుఱించి శ్రీఅరవిందు లాకాలమున రచించిన వ్యాసములను బఠించినవారికి వారియాదర్శవిధానములు తెలియగలవు. ఆవ్యాసము లిపుడు గ్రంథరూపమున ముద్రితములై వెలువడియున్నవి. జాతీయవాదులు ప్రభుత్వ పాఠశాలలకు ప్రత్యామ్నాయముగా జాతీయపాఠశాలలుండవలయు నని సంకల్పించగా విద్యాసంఘములోని

మితవాదులు ప్రభుత్వాధికారుల యాగ్రహమునకు గుఱి యగుదుమేమో యను భయసందేహములతో ప్రభుత్వ విద్యావిధానములోని లోపములను కొంతవఱకు తొలగించి ప్రభుత్వవిద్యాలయముల కుపాంగములుగా దోహదములుగా నుండవలయు నని నిశ్చయించిరి. వేయేల? వారి యాదర్శవిధానముల నన్నింటిని ప్రభుత్వమువారి కోపానలమునకు బలిగాకుండునట్లును, నాటియొడుదుడుకు లుపశమించినతరువాత నెప్పటికైనను ప్రభుత్వసంబంధమేదో యొకవిధముగా నుండి వారి డిగ్రీల నందుటకు వీలుగా నుండునట్లును తగురీతి కుదించి మార్చి జాతీయ విద్యను నేతిబీరకాయగా నామావశిష్టము గావింప నెంచిరి. ఈస్థితిలో శ్రీఅరవిందులకు బరోడాకళాశాలలో నాంగ్లము చరిత్రము బోధించుచుండునట్లే యిచ్చటను బోధించుటతప్ప తనయున్నతభావములకు విధానములకు ననురూపముగా వ్యవహారములను తీర్చిదిద్దుటకు వీలుగా నందున వా రచిరకాలములోనే ఆచార్యపదవినుండి విరమించి కళాశాలసంబంధమును విసర్జించుకొనిరి.

'వందేమాతరం' పత్రికాసంబంధము

నాడు జాతీయపక్షమున దినపత్రిక లంతగా లేవు. తిలక్ లోకమాన్యుని 'కేసరి'యను మరాటీవారపత్రికొక్క-

టియే జాతీయవాదపక్షమును సంపూర్ణముగా నామో దించి ప్రచార మొనర్చుచుండినట్లు కనబడుచున్నది. నూతనోద్యమసిద్ధాంతవిధానములను వెల్లడించుటకు జాతీయపక్షమున లోకమం దంతటను బ్రచారము గావించుటకును ఆంగ్లమున దినపత్రికను స్థాపించవలసిన అవసర మేర్పడినద. అంతకుముందు కొలదిదినముల క్రిందటనే బ్రహ్మబాంధోపాధ్యాయస్వాము లను ప్రతిభాశాలి, త్యాగమూర్తి, జాతీయవాది విపినచంద్రుని సాయముతో 'వందేమాతరం' అను వారపత్రికను స్థాపించియుండిరి. జాతీయపక్షనాయకు లగు తిలక్ లోకమాన్యుడు, శ్రీఅరవిందులు, అశ్వినీ కుమారదత్తు, సుబోధచంద్ర మల్లిక్ మున్నగువారు సుబోధచంద్రమల్లిక్ గారిగృహమందు, సమావేశమై, నూతనముగా స్థాపితమైన ఆ 'వందేమాతరం'పత్రికనే జాతీయపక్షముక్రింద, జాయింటుస్టాక్ కంపెనీ స్థాపించి, ఆసంఘమువారు దినపత్రికగా నిర్వహించవలయు ననియు, ఆకంపెనీమ్యానేజింగు డైరెక్టరుగా తత్పత్రికా ప్రధానసంపాదకులుగా శ్రీఅరవిందులే యుండవలయు ననియు తీర్మానించిరి. శ్రీఅరవిందుల సంపాదకత్వమున వెలువడ నారంభించినది మొదలు 'వందేమాతరం' పత్రిక పత్రికాప్రపంచమున కని విని

మెఱుంగని నూతనవాతావరణమును కలిగించ నారం భించెను. ఆసేతుహిమాచల మార్యావర్తదేశమందే కాక పాశ్చాత్యదేశమందును తన దివ్యసందేశములను ముక్త కంఠముతో ననుదినము గాన మొనర్చుచు వ్యాప్తిగాంచు చుండెను. శ్రీఅరవిందులు జాతీయకళాశాలలో నే యేబది యఱువదిమంది విద్యార్థిబృందమునకో జాతీయ ధర్మసూత్రముల నేర్పుటకు బదులు అఖిలభారతీయులకు జాతీయతాస్వరూపమును విప్పిచెప్పనాచార్యు డాయెను.

ప్రప్రథమమున తనయానందమఠ మనునవలలో 'వందే మాతరం' మంత్రోపదేశ మొనర్చి గానము చేయిం చినది ఋషి బంకించంద్రులే అయినను ఆమంత్రార్థ మును వెల్లడించి భరతమాత కేవలము నదీపర్వతారణ్యా మయమైన కేవలజడముగాక సర్వశక్తిప్రదీపితయగు శక్తి స్వరూపిణి యని ధర్మపత్నికి వ్రాసిన లేఖలో వివరించి నట్లు, యథార్థస్వరూపముచు బ్రస్ఫుట మొనర్చి వందే మాతరమనుగానమును సజీవ మొనర్చి భారతపుత్రులు పులకాంకితు లగునట్లు ప్రచారమునకు తెచ్చినది శ్రీఅర విందులే. స్వరాజ్యసామ్రాజ్యసంబంధముల నాధ్యాత్మిక దృష్టితో విమర్శించి, 'సంపూర్ణస్వాతంత్ర్యమే' మన యాదర్శ మని నిర్భయముగా లోకమునకు చాటినది

శ్రీఅరవిందులే. ఐర్లెండు సిన్ ఫిన్ విధానముంబోలిన స్వాతంత్ర్య సంపాదనావిధానమును భారతదేశమునకు జూపించి 'పరిపాలనాధికారము లేనంతవఱకు ప్రభుత్వ ముతో సహాయనిరాకరణ మవలంబించవలయు' నని 'స్వసాహాయ్యమున నే ఆధారపడి కార్యసిద్ధిగాంచవలయు' నని మున్ముందు హెచ్చరించినది శ్రీఅరవిందులే. ఈ సత్యము 'నాదేశీయుల కొక బహిరంగలేఖ'యను శీర్షిక క్రింద ౧౯౦౯ లో వారు రచించినలేఖను పఠించిన వారికి తెలియగలదు. వారు చాటిన ప్రతి యాదర్శ విధానమును అధ్యాత్మజ్ఞాన సంజనితమై, ధర్మశాస్త్ర సమ్మతమై, సద్ధర్మ పరిపాలనా సూత్రముల కను గుణమై, ప్రతిపక్షులును ఖండింపజాలనంత హేతు బద్ధసమన్వితమై యుండెను. అందున నే శ్రీ అర విందుల సంపాదకత్వమున వెలువడుచుండిన 'వందేమా తరం' పత్రిక ఆంగ్లభాషాపరిచయము గలవారి కను దినము పఠించు పారాయణగ్రంథమై యుండెను. ఆ పత్రికలోని సంపాదకీయవ్యాసము లిండియాలోని యన్ని పత్రికలందే కాక లండన్ పట్టణములో ప్రభుత్వములనే తారుమారు గావించగల 'టైమ్సు' పత్రికారాజము నందును పునర్ముద్రితము లగుచుండెను.

అంతవఱకు 'భిక్షాం దేహి' యని తమకష్టముల నేకరవుపెట్టుకొనుచు మఱికొన్నియుద్యోగము లిప్పించుడని విద్య చెప్పించుడని ఈ యా సాయములను జేయుడని ప్రార్థనలతో తృప్తిచెందుచుండిన దేశీయమహాసభలో నూతనశక మారంభింపగల అద్భుతపరివర్తనము దేశమందీపత్రికామతల్లివలన నేర్పడినది. అందుననే ౧౯౦౬-వ సంవత్సరమున కలకత్తాలో సమావేశమైన దేశీయమహాసభయందు భారతపితామహుడుగా బూజనీయుడైయుండిన స్వర్గీయ దాదాభాయి నౌరోజీ యధ్యక్షతక్రింద స్వరాజ్య-స్వదేశీ-బహిష్కార - జాతీయవిద్యలనుగుఱించిన తీర్మానము లామోదితములై మితవాదనాయకులకు కన్నెఱ్ఱనై పక్షభేదములు విజృంభింప నారంభించెను. జాతీయపక్షమునకు నిజముగా శ్రీ అరవిందులే సంజీవియైనను పేరుప్రతిష్ఠలను ప్రకటనాడంబరములను గాంక్షించని నిరాడంబరప్రియు డగుటచే తానే తిలక్ లోకమాన్యుని జాతీయపక్ష నాయకునిగా వరించి వారి కగ్రస్థాన మొసంగి తా నండయై యుండెను.

శ్రీ అరవిందులలేఖినీ మాహాత్మ్యమువలన 'వందేమాతరం' పత్రికామతల్లి యనుదినము జాతీయతత్త్వమును బోధించి స్వయంసాహాయ్యమున చేయగలకార్య

విధానమును స్పష్టముగా నాదేశించి దేశీయులను ముఖ్యముగా వంగీయుల నుత్తేజవంతుల గావించి వీరావేశమున ముంచివైచినది. విద్యాలయందు, పరిశ్రమలయందు, భావములందు, నిత్యవ్యవహారములందు స్వదేశీతత్త్వము వెల్లడిగా నారంభించెను. విదేశవస్తుబహిష్కారము సంపూర్ణ విజయముగాదొడంగెను. ప్రభుత్వ విద్యాలయములు బహిష్కరింపబడి దేశమం దెల్లెడల జాతీయపాఠశాలలు స్థాపింపబడెను. ప్రభుత్వన్యాయస్థానములు బహిష్కరింపబడి పంచాయతీ పద్ధతులవలన నాయా మండలముల లోని పెద్దమనుష్యులు లక్షలకొలది విలువగల వ్యవహారముల నుభయకక్షులవారును శిరసావహించునట్లు ధర్మముగా న్యాయముగా తీర్మానింప నారంభించిరి. ప్రభుత్వము వారి సాయము నపేక్షించరా దనుభావముతో ప్రతి ప్రదేశమునను స్వచ్ఛంద సేవకబృందమును నెలకొల్పిరి. వారే ప్రజాహిత కార్యములందు రక్షకభటులై సేవచేసి పౌరుల ప్రీతివిశ్వాసములను బడయుచుండిరి. ఇంతటి ఫలప్రదమగు కార్యవిధానమును నిర్ణయించి దేశము నందు స్వాతంత్ర్య పిపాసతో ధైర్యోత్సాహములతో నూతన వికాసమును గలిగించుచున్న 'వందేమాతరం' పత్రిక ప్రభుత్వాధికారుల యాగ్రహమునకు బాత్రమగు

టలో విచిత్ర మేమియు లేదు. అప్పటికిని నిజసంపాద కీయవ్యాసములకంటె 'యుగంధర్' 'సంధ్య' మున్నగు తీవ్రవాద దేశభాషాపత్రికలనుండి యెవరో యనువదించి ప్రకటించినవ్యాసములు రాజద్రోహకరములుగా నున్న వని శ్రీఅరవిందులపైనను పత్రికాసంబంధముగల మఱి కొందఱిపైనను ప్రభుత్వమువారు నేరారోపణము గావించిరి. ఈ సందర్భముననే విపినచంద్రపాలు డంతగా కనివిని యెఱుంగని నూతనమార్గము ద్రొక్కి బ్రిటిషు వారి న్యాయస్థానములందు ముఖ్యముగా రాజద్రోహపు కేసులవిషయమున సాక్ష్యమిచ్చుట మనస్సాక్షికి విరోధ మని సాక్ష్యమియ్య నిరాకరించి తన్మూలమున కోర్టు ధిక్కారనేరమునకుగా నాఱుమాసముల కారాగార వాస మనుభవించిరి. శ్రీఅరవిందులపై నారోపించిన నేరము ఋజువు గానికారణమున నిరుపయోగమై శిక్ష విధించుటకు వీలులేకపోయినది. ప్రభుత్వాధికారులు శ్రీఅరవిందులపై నెత్తిన ప్రథమదండయాత్ర ఇట్లు భగ్న మైనది. ఈకాలమున శ్రీఅరవిందులు తమధర్మపత్నికి వ్రాసిన మఱియొకయుత్తరము నీక్రింద బ్రకటించు చున్నాము. ఇందువలన నాడు వారి నావరించియుండిన కార్యభారము, పెద్దలయెడల వారికిగల సద్భావము, ధర్మ

పత్నికి చేసిన ధర్మోపదేశము, చూపిన ప్రేమాదరణములు తెలియగలవు.

కలకత్తా
౬ డిసంబరు ౧౯౦౭

ప్రియ మృణాళినీ !

మూడుదినముల క్రిందట నీ ప్రేమపత్రము నందుకొంటి. ఆదివసముననే పచ్చడము నంపియుంటిని. ఎందులకు నీ కది చేరదయ్యెనో ఊహింపజాలకున్నాను.

*  *  *

*  *  *

నా కిచ్చోట నొకముహూర్త మైనను వ్యవధి లేదు. లిఖించుభారము సమస్తము నామీద నున్నది. కాంగ్రెసు భారము, వందేమాతరముగడబిడ సర్దుపాటు చేయు భారము నాపై నున్నది. నాకు చాల సమయాభావముగ నున్నది. అదియుగాక స్వకార్యము లనేకము లున్నవి. వాని నవహేళనము చేయజాల.

నామాట నొకదానిని విందువా? ఇపుడు నా కత్యంత దుర్భావనాసమయము. నలుగడల నున్మాది నగునంతటి పనిగా నున్నది. ఈసమయమున నీ వస్థిరమైన నాచింతాదుర్భావనములు వృద్ధిపొందును. నీ వుత్సాహశాంతనపూర్ణమగు జాబులు వ్రాయుదువేని విశేషశక్తినిబొంది ప్రఫుల్లచిత్తంబున సకల విపత్తుల నతిక్రమించగలను. నీకు దేవఘురుపట్టణమున నొంటరిగ నుండుట కష్టతరమని నాకు తెలియును. కాని మనస్సు

దృఢపఱచుకొని విశ్వాసమునందు దృష్టియుంచినచో ఆ దుఃఖము హృదయమం దాధిపత్యము చేయజాలదు. నన్నుం గూడి నీ వివాహ మెప్పుడు సమకూడినదో నీభాగ్యమున నీదుఃఖ మనివార్యము. అది మధ్యమధ్య విచ్ఛిన్నము గాక మానదు. కారణము సర్వసాధారణ వంగదేశీయులబోలె పరివారస్వజనసుఖజీవనము నుద్దేశముగ నెంచజాల. ఈ యవస్థయందు నాధర్మమే నీధర్మము. నా నిర్దిష్టకార్యసఫలత్వము నీసౌఖ్యమని యెంచనిచో నన్యోపాయములేదు.

మఱియొక సంగతి. నీవెవరింగూడి ఇపుడు వాసముచేయుచుంటివో వారిలో ననేకులు నీకును నాకును గురుజనులు. వారేమయిన బరుషవాక్యములు సంభాషించినను అన్యాయవ్యవహారములం జెప్పినను నీవు వారియెడ గ్రోధమును బూనవలదు. మఱియుఁ వారేమి యుచ్చరించినను నవియన్నియు వారి మనఃపూర్వకవాక్యము లనియు నిన్ను దుఃఖముల పాల్సేయుటకై వచించిరనియు నీ వూహించవలదు. అనేకసమయములందు క్రోధమున తెలియక పరుషవాక్యములు బయల్పడును. వానిని స్వాంతమునం దుంచరాదు. నీవచ్చట నుండలేనిచో గిరీశబాబునకు జెప్పెద. నేను కాంగ్రెసున నున్నంతవఱకు నీ మాతామహుడు గృహమునం దుండగలడు. ఈదినమున మేదినీపురము బోయెద. తిరిగి విచ్చేసి సకలవ్యవహారముల జక్కబఱచి సూరత్‌నకు బోయెద. ౧౫ - ౧౬ తేదులలో బయనమయ్యెద. జనవరి రెండవ తేది మరల వచ్చెదను.

ఇట్లు

**నీ పతి.**

## సూరత్ కాంగ్రెస్సు

పైలేఖలో సూచించినట్లు ౧౯౦౭ డిసంబరు మాసాంతమున దేశీయమహాసభాసమావేశమునకు జాతీయపక్షనాయకుడుగా శ్రీఅరవిందులు సూరతుపట్టణమునకనేక ప్రతినిధులతో వెళ్లియుండిరి. సూరత్ కాంగ్రెస్ విధ్వంసమునకు తిలక-అరవిందుల — మెహతా-ఘోఖ్లేల వ్యక్తిగతవిరోధములు, అన్యోన్యద్వేషాసూయాదులు, జాతీయవాదుల తుందుడుకులు కారణములని పెద్దలు కొందఱానాడారోపించియుండినను కొంచెము సూక్ష్మముగాపరిశీలించగలవారికి, జాతీయతత్త్వమును గ్రహించగలవారికి, దృష్టిభేదములే సిద్ధాంతవిధానములందుగల భిన్నభావములే ముఖ్యకారణము లని స్పష్టము కాగలదు. అఖిలభారతదేశమునకు ప్రజాప్రతినిధిసంస్థయై దేశీయులందఱిభావముల గ్రహించి తదనుగుణముగా తీర్మానము లొనరించి దేశాభివృద్ధికి తోడ్పడవలసిన దేశీయమహాసభ నాటివఱకు మితవాదనాయకులగు ఏ మెహతా, ఘోఖ్లే, వాచా, కృష్ణస్వామిఅయ్యర్ ఆదిగాగల ఐదాఱుగురి నిరంకుశ పరిపాలనమునకు లోనై కేవలము మితవాదుల భుక్తమై యుండెను. ఈ నిరంకుశచర్యల

నంత మొందించి నిజమైన ప్రజాప్రతినిధిసంఘముగా పరివర్తన మొందించ జాతీయవాదులు నిశ్చయించిరి. కలకత్తాలో నంతకు ముందుసంవత్సరమే దేశీయమహా సభలో దాదాభాయిపితామహుని యధ్యక్షతక్రింద తీర్మానమైన - స్వరాజ్య - బహిష్కార - తీర్మానములకు మితవాదు లడ్డుదగిలి 'స్వరాజ్య' మనుపదమే విసర్జ నీయమై బ్రిటిషుప్రభుత్వాధికారమునకు లోబడిన అధి నివేశపరిపాలనమే భారతీయుల ఆదర్శమని తీర్మానించు టకు దీక్షవహించి కుట్రల నెన్నింటినో పన్నసాగిరి. బహిష్కారతీర్మానమునే రద్దుగావించిరి. తుదకీ రెండు తీర్మానములు దేశీయమహాసభలో చర్చించుటకేని యవ కాశ మియ్యరాదని దృఢసంకల్పులైరి. ఈతిరోగమ నము, ఈనిరంకుశము జాతీయవాదులకు హృదయశల్య మైనది. స్వరాజ్య - బహిష్కార - స్వదేశీ - జాతీయవిద్య లనుగుఱించిన ప్రధానతీర్మానము లీనాలుగును మహా సభలో చర్చించబడవలయు నని ఆమోదనిరాకరణము లచ్చటనే నిశ్చయింపబడవలయు నని వీరు పట్టుపట్టి ప్రాణ మొడ్డిరి. ఇట్టి ప్రధానవిషయములందేకాక ఇతర విషయములలోను తీవ్రభేదము లేర్పడినవి. మొట్టమొదట నాగపూరులో దేశీయమహాసభ జరుగునట్లు నిశ్చితమైన

ను అచ్చట జాతీయవాదులకు పలుకుబడి ప్రబలముగా నున్నదని తమనాయకత్వము చెల్లదని కొన్నితంత్రముల గల్పించి మితవాదులు దేశీయమహాసభాసమావేశము నచ్చటనుండి తమయానుకూల్యమునకుగా సూరత్తునకు మార్చిరి. అపుడే దేశాంతరవాసశిక్షనుండి విడుదలవై వచ్చిన, పంజాబు కేసరి యనిపేరుమోసిన, కర్మవీరు డని కొనియాడబడిన లాలా లజపతిరాయిని సభాధ్యక్షులుగా నుండవలయు నని జాతీయవాదులు ప్రతిపాదించగా దానిని నిరాకరించి మితవాదియగు రసవిహారిఘోషును సభాధ్యక్షునిగా మితవాదులు నిర్ణయించిరి. ఇట్లు మితవాద జాతీయవాదపక్షీయు లుభయులు తమతమ యాశయముల నెఱవేర్చుటకు సన్నద్ధులై సూరత్ పట్టణమున సమావేశమైరి.

మహాసభకు పూర్వము రెండుమూడు దినములుగా నేదో యొకవిధమున సమాధానపడుటకు శ్రీఅరవిందులసాయమున లోకమాన్యుడు విశ్వప్రయత్నమొనర్చెను. తుదకు రసవిహారిఘోషు సభాధ్యక్షులుగా నుండుటకును సమ్మతింతు మనియు ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము ముగిసినతరువాత, సభాధ్యక్షుని వరించు ప్రతిపాదన మొనర్చినతరువాత, సభాకార్యక్రమ ముప

క్రమింపబడుటకుముందు, మహాసభలో తమ జాతీయ పక్షమువారిభావములను దెలుపుకొనుటకు తన కవకాశ మిప్పించుడని లోకమాన్యుడు ఒకటి రెండుపర్యాయ ములు లిఖితపూర్వకముగా నాహ్వానసంఘమువారికిని, తదధికారులకును తెలుపుకొనిరి. కాని మితవాదులు, రాయబారుల సమాధానప్రయత్నములకు నవకాశ మీయక, లోకమాన్యునికి నిర్లక్ష్యముగా, ప్రత్యుత్తర మేని ఇయ్యలేదు. అందువలన సభాసమయమున తాను ముందుగా తెలిపినవిధమున సభాధ్యక్షువరణప్రతిపాదన మైనతరువాత లోకమాన్యుడు సభావేదికపై నిలచి మాటాడ నారంభించెను. మాటాడనీయగూడ దని భల్లూకపుపట్టు పట్టి కూర్చొనియున్న మితవాదనాయ కులు తదనుచరులు నిరోధించుటయు నంత కల్లోలము ప్రారంభమై కాంగ్రెసు విధ్వంస మగుటయు నంద ఱెఱింగినదే. ఇరుపక్షముల పక్షాభిమానమువలననే అది వఱ కెన్నడును కనివిని యెఱుంగనంత ప్రతినిధులసంఖ్య మిక్కుటముగా నుండెను. జాతీయవాదులుమాత్రమే యన్నిరాష్ట్రములనుండి ఎనిమిదివందలు ప్రతినిధులుగా వచ్చియుండిరి. సభావిధ్వంసమైన మఱునాడు మిత వాదులు సభాప్రవేశమునకే కొన్నినియమముల నిర్ణ

యించి వాటిని శిరసావహించినవారే సభాప్రవేశమున కర్హులని శాసించి సభాసమావేశ మొనర్చి జాతీయవాదులను నిందించుచు తమ కనుకూలమైన తీర్మానములగావించి తృప్తిపడిరి. ఆ మితవాదులసభను విధ్వంస మొనర్చి, వారితీర్మానముల నోడించి, తన జాతీయపక్షమువారితీర్మానములే నెగ్గునట్లు చేయవలయునను సంకల్పముతో, కేవలము సభాప్రవేశము దొరకుటకు, పేరుకు, మితవాదులు నిర్ణయించిననియమముల నంగీకరించినట్లు సంతకములు చేసి, సభలో బాల్గొనవలయు నని లోకమాన్యుడు సూచించెను గాని శ్రీఅరవిందు లందుల కంగీకరించ లేదు. అందున జాతీయవాదులు ప్రత్యేకముగా సభను జరిపి ఆమహాసభకు శ్రీఅరవిందులను అధ్యక్షులుగా నెన్నుకొని విధ్వంసకారణములను విస్పష్ట మొనరించి జాతీయపక్ష ఆశయములను వెల్లడించి తదనుగుణముగ తీర్మానముల గావించి దేశీయుల కర్తవ్య మిది యని చాటించిరి. జాతీయపక్షసమావేశమున కధ్యక్షులుగా నెన్నుకొనబడిన శ్రీఅరవిందులు జాతీయవాదుల యాదర్శ విధానములను నాటి దేశస్థితులను దేశీయులకర్తవ్యమును ప్రబోధించుటకు ఉత్తర దేశసంచారమును సాగించిరి. సూరత్ సభ కావల మితవాదులు దేశీయమహాసభా

దర్శము 'బ్రిటిషుసామ్రాజ్యాంతర్గతస్వపరిపాలనము' అని తీర్మానించినతరువాత శ్రీఅరవిందులు 'స్వాతంత్ర్య నిర్వచనము'నుగుఱించి వ్రాసిన వ్యాసము నీక్రింద నుదాహరించుచున్నాము.

## స్వాతంత్ర్య నిర్వచనము

మన రాజకీయాందోళనముయొక్క లక్ష్యము స్వాతంత్ర్యసిద్ధి యని యెల్ల రంగీకరించెదరు; కాని స్వాతంత్ర్యముయొక్క అర్థమును నిరూపించుటలో మాత్రము చాల మతభేదములు గలవు. స్వాతంత్ర్య మనిన స్వాయత్తశాసన మని కొందఱును, ఉపనివేశములయందుండెడి రాజ్య మని కొందఱును వాదించుచున్నారు. వ్యావహారిక పారమార్థికములయందు సంపూర్ణస్వాధీనతయే దత్ఫలమగు నఖిలానందమును, స్వరాజ్యమని ఆర్యఋషిగణము సిద్ధాంతీకరించెను. రాజకీయ స్వాతంత్ర్యము స్వరాజ్యముయొక్క ఒక్కయంగము మాత్రమే యని తెలిసికొనవలెను. రాజకీయ స్వాతంత్ర్యమునకు రెండు దిక్కులు గలవు—బాహ్యస్వాధీనత - ఆంతరంగిక స్వాధీనత. విదేశ శాసనమునుండి విముక్తి బాహ్యస్వాధీనత. ఇదియే రాజకీయ స్వాతంత్ర్యముయొక్క చరమవికాసము. ఏజాతి ఎంతకాలము పరశాసనము క్రింద నుండునో ఆజాతిని స్వతంత్రజాతియని చెప్పుటకు వీలు లేదు. ప్రజాతంత్రస్థాపనము గానంతవఱకు ఆ జాతియందు ఆంతరంగిక స్వాధీనత వికసింపజాలదు. మనము గోరుచున్నది సంపూర్ణస్వరాజ్యము విదేశీయుల ఆదేశబంధనములనుండి విముక్తిని గోరుచున్నాము. ఇదియే మనరాజనీతియొక్క లక్ష్యము.

ఈ యాకాంక్షకు గారణమును గుంతించి సంక్షేపముగ జెప్పెదను. జాతికి పరాధీనత మృత్యుదూత, నాశనకారి. స్వాధీనత యన్ననో జాతీయజీవనమును రక్షించు మంగళదేవత, ఉన్నతపథమునకు దోడ్పడు సంభావనాశక్తి, స్వధర్మమును భద్రపఱచు నుత్తమ సాధనము. స్వధర్మమనగా స్వభావ నియతమైన జాతీయ కర్మచేష్టలను బురికొల్పు ఉన్నతపథము. విదేశీయులు మనకెంత హితైషులైనను వారు మనపై పరధర్మభారమును మోపుటకు వెనుదీయరు. వారి యుద్దేశ మెట్టిదైనను తన్మూలమున మనకు హితము కలుగనేరదు. పరులస్వభావ నియతమైన పథమున నడచుటకు మనకు శక్తిగాని ప్రేరణగాని యుండదు. వారిమార్గమున నడచుట కభ్యాసపడి యెంతో సొగసుగ అనుకరించ గలవారము కావచ్చును. ఇతరుల ఉన్నతికి లక్షణను లైన వేషణ భూషణములను మనము దక్షతతో ననుకరించి మన యవినీతిని కొంతకాలము మరుగుపఱచుకొనవచ్చును. కాని పరీక్షకాల మేతెంచునప్పుడు, పరధర్మసేవాసంభూతమైన దుర్బలతయు నసారతయు బయల్పడి మనవినాశనప్రాప్తికి హేతువులగును. రోమక సామ్రాజ్యాధిపత్యముక్రింద, రోమక సభ్యతాప్రాప్తి గలిగిన యూరోపియన్ జాతులు సుఖముగను, స్వచ్ఛందముగను అనేకదినములు గడిపెను. కాని వారిశేషావస్థ అత్యంత భీకర రూపమును దాల్చెను. మనుష్యత్వ వినాశమువలన వారికెట్టి ఘోరదుర్దశ సంప్రాప్తమయ్యెనో అట్టిదే ప్రతి పరాధీనజాతికి మనుష్యత్వము విలుప్తమై ఘోరదుర్దశ సంభవించును. పరాధీనతయొక్క భిత్తి స్వధర్మనాశనము, పరధర్మసేవ. పరాధీనావస్థయందు స్వధర్మరక్షణము చేసికొనుచు బునర్జీవమును బొందినయెడల, పరాధీనతయొక్క బంధనములు తమంతట నవియే తెగి పోవును. ఇయ్యది ప్రకృతియొక్క అలంఘనీయ

మైన నియమము. స్వదోషముచే నేజాతియైనను బరాధీనమైనయెడల, అవికలమును, సర్వాంగ సుందరమును అగు స్వరాజ్యమే రాజనీతి యొక్క లక్ష్యమై యుండుట సహజము, శ్రేయస్కరమును.

ఔపనివేశికస్వాయత్తశాసనము స్వరాజ్యము కాదు. జాతీయాదర్శధర్మములు భ్రష్టముగాకుండ సంపూర్ణస్వాతంత్ర్యము సిద్ధించిన యెడల నౌపనివేశిక స్వాయత్తశాసనము స్వరాజ్యసిద్ధికి అనుకూలమైన పూర్వదశ గావచ్చును. బ్రిటీషుసామ్రాజ్యమునకు వెలుపల స్వాతంత్ర్యాశను బోషించుకొనుట దుర్మార్గమును రాజద్రోహసూచకము నను కథయొకటి బయలుదేరినది. ఔపనివేశిక స్వాయత్తశాసనముతో సంతుష్టి చెందనివారు విప్లవకారులనియు సర్వవిధరాజనీతికార్యములకు వర్జనీయులనియు గొందఱి యభిప్రాయము. ఇట్టి ఆదర్శమునకును వీరి యభిప్రాయమునకును ఎట్టి సంబంధమును లేదు. ఆంగ్లేయ రాజనీతిజ్ఞులే యిట్టి స్వరాజ్యాకాంక్ష రాజనీతిలక్ష్యమని అంగీకరించిరి. స్వాధీన తాదర్శ ప్రచారము సంగతము దోషశూన్యము నని ఆంగ్లరాజ్యతంత్రజ్ఞులు ముక్తకంఠముతో బల్కిరి. మన స్వాతంత్ర్యము బ్రిటీషు సామ్రాజ్యమునకు అంతర్గతమా లేక బహిర్గతమా యను చర్చ ప్రస్తుత మనవసరము. మనము కోరునది పూర్ణాంగస్వరాజ్యము. మన స్వరాజ్యము బ్రిటీషు సామ్రాజ్య నీతియుక్తముగ నుండుటకు సంభవమైనచో మన కెట్టియభ్యంతరమును లేదు. మనము స్వరాజ్యము గోరుచున్నది ఇంగ్లీషువారిమీద ద్వేషముండి కాదు. దేశరక్షణనిమిత్తమునమము స్వరాజ్యమునకై ప్రయత్నించుచున్నాము. స్వధర్మమును భ్రష్టపఱచుకొని పూర్ణాంగస్వరాజ్యమునకు భిన్నముగ నన్యాదర్శములను స్వీకరించి దేశీయులను మిథ్యారాజనీతికరులుగ జేయు దేశరక్షణ మను మాయోపాయ ప్రదర్శనమునకు మాత్రము ఒప్పు

శానము. ఈకారణముచేతనే (నాటి) కాంగ్రెస్ క్రీడు దేశమున కాప త్కారమైనది. *

శ్రీ అరవిందుల తమ్ములు వరేంద్రుని స్వీయ చరిత్రమును జదివినవారికి అతడు రాజసగుణప్రధాను డనియు అనుకొనినది అనుకొనినయట్లు వెనుకముందు లారయక యనుష్ఠించు ఉద్వేగియనియు తెలియగలదు. కాని దేశస్వాతంత్ర్యమునకు 'ఆనందమఠము' లోని విధానము, సన్న్యాసివేషముల ననుకరించుట మంచిదని సన్న్యాసులవద్ద యోగులవద్ద మహత్తరశక్తులు గలవని వాని నెట్లయిన సంపాదించవలయునను సంకల్పముతో సన్న్యాసులకై యోగులకై వీరు పలుప్రదేశములు తిరిగి యన్వేషించినట్లును తెలియుచున్నది. ఈయన్వేషణాసంద ర్భమున గుజరాతులోని యొక యోగపురుషుని-సన్న్యా సికాదు, సంసారియె - కనుగొని కొంత యుపదేశము నందినట్లును వరేంద్రుని ఆత్మచరిత్రము తెలుపుచున్నది. శ్రీ అరవిందుల కాధ్యాత్మికతృష్ణ తీవ్రముగా గలదని చక్కగా నెఱింగిన వరేంద్రుడు, సూరత్ మహాసభకు ప్రతినిధిగా వచ్చియుండిన వరేంద్రుడు 'విష్ణుభాస్కర లెలే' యను ఆయోగిని, సమీపమున బరోడాలో

* కృష్ణాపత్రికనుండి.

నున్నవానిని, ఒకపర్యాయము చూచి మాటాడి యథార్థమును కనుగొనవలసినదిగా జెప్పి వారిని ప్రోత్సహించెను. అందువలన సూరత్ పట్టణమున నుపన్యసించి శ్రీ అరవిందులు ౧౯౦౮ జనవరి ప్రారంభమున బరోడా పట్టణమునకు వెళ్లియుండిరి. బరోడామహారాజును గూడ దర్శించి మాటాడియుండిరి. అచ్చటి కళాశాలోపాధ్యక్షుడు లేకారణముననో విద్యార్థు లెవరును శ్రీ అరవిందుని దర్శించి సన్మానించరాదని కఠినముగా నుత్తరు వ్రాసంగియుండిరట. కాని శ్రీ అరవిందు లామార్గమున కళాశాలసమీపముగా వెళ్లుట నెట్లో విద్యార్థులు కనిపెట్టి గుంపుగా, కళాశాలను ఉపాధ్యాయవర్గమునకు నా అధ్యక్షునకే విడిచిపెట్టి, పరువెత్తివచ్చి శ్రీ అరవిందుని దర్శించి నమస్కరించి, బండికి గట్టియున్న గుఱ్ఱములను విప్పివైచి తమ కోమలహస్తములతో బండిని లాగి యూరేగించి, యుత్సవమొనర్చి గురువర్యులపట్ల తమకుగల ప్రేమభక్తులను వెల్లడించియుండిరి.

శ్రీ అరవిందులు లెలేగారినిదర్శించి యోగవిషయముల తత్త్వవిషయముల గుఱించి మాటాడిరి. లెలేగారు యోగాభ్యాసమున శ్రీ అరవిందులకు సాయపడ నుత్సహించి మునుమున్న 'యోగశ్చిత్తవృత్తినిరోధః'

యన్నట్లు చిత్తమునందే భావపరంపరలు నుదయించి కలత కలుగనీయకుండునట్లు ప్రశాంతినందుట కేకాంత ముగా ధ్యానము - మెడిటేషన్ - చేయుడని సాధన మార్గమును సూచించిరి. తదనుసారముగా లెలేగా రింటనే మూడుదినములు తదేకధ్యానమున శ్రీ అర విందులు సాధనచేయగా చిత్తము ప్రశాంతమై బ్రాహ్మీస్థితి ననుభవించిరి. ఆస్థితిలో తమ హృత్పద్మమునుండి హృద యస్థుడగు పరమేశ్వరునినుండి యొక యంతర్వాణి వారికి కర్ణగోచరమైనది. అదియే గురూపదేశమాయెను. ఇట్లు భగవంతుడగు నంతస్స్థితపురుషునివలన నుపదేశ మందుభాగ్యము మహాపురుషులకుగాని సామాన్యులకు లభింపదు. ఆ యంతర్వాణియాదేశము ననుసరించి శ్రీ అరవిందులు సాధనచేయుచుండిరనుటకంటె హృత్పురుషు డగు భగవంతుడే వారిసాధనను నడిపించుచుండె ననుట సముచితము. ఆవల కొంతకాలమునకు ప్రాయశః ౧౯౦౮ ప్రారంభమున విష్ణుభాస్కరలెలే వరేంద్రుని యాహ్వానము ననుసరించి కలకత్తాకు వచ్చినట్లును అపుడు వారు శ్రీ అరవిందులను జూచి 'సాధన చేయు చున్నావా? నీసాధన ఎట్లున్నది?' అని ప్రశ్నించి నట్లును అందులకు 'నేనే సాధనయు జేయుటలేదు. భగ

వానుడే సర్వము చేయించుచున్నాడు. అతనియాదేశాను సారముగానే నాజీవితవ్యవహారము వడచుచున్నది ' అని శ్రీ అరవిందులు ప్రత్యుత్తర మిచ్చినట్లును తెలియు చున్నది. పాపము తెలేగా రొకటి రెండు పర్యా యము లేదో యుపదేశ మొనర్చ బ్రయత్నించిన, శ్రీ అరవిందులు స్వీకరించక తప్పించుకొనినట్లును కనబడు చున్నది. అట్లా బ్రాహ్మీస్థితి ననుభవించిన నాటినుం డియు నంతర్వాణిమూలమున హృత్పురుషాదేశమును గ్రహించగలిగిన నాటినుండియు సర్వ కార్యములు, ఉప న్యాసములు, వ్రాతలు తన ప్రయత్నమున గాక భగవత్ ప్రసాదముగా స్వతః ప్రేరణ (ఇంట్యూషన్) మూలమున నిర్వహింపబడుచున్నవనియు నాస్థితిలో వెల్లివిరిసిన దే తమ వాఙ్మయమనియు శ్రీఅరవిందు లొకానొక సంద ర్భమున వెల్లడించినట్లు తెలియుచున్నది. సూరత్ కాంగ్రెసునుండి కలకత్తాకు వచ్చిచేరినతరువాత శ్రీఅర విందులు తమ ధర్మపత్నికి* వ్రాసిన ఈక్రింది లేఖవలన పైవిషయము మఱింత స్పష్టముగాగలదు.

---

* ధర్మపత్నికి శ్రీ అరవిందులు వ్రాసిన మూడులేఖలును కృష్ణాపత్రిక నుండియే.

కలకత్తా,
౨౩ స్కాట్సులేన్,
౧౭. ఫిబ్రవరి ౧౯౦౮,

ప్రియ మృణాళినీ!

అనేకదినములనుండి నీకు జాబులు వ్రాయకుండు నా యపరాధమును నీవు క్షమింపనిచో నే ఉపాయ మేమున్నది? ఎయ్యది మజ్జాగతమో యందే యీజన్మము గడచునేమో!

౮-వ జనవరి రావలెనని యుంటిగాని రాజాల నైతిని. అయ్యది నాయిష్టానుసారమున ఘటించలేదు. ఈశ్వరు డెచ్చటికి దోడ్కొనిపోయెనో యచ్చటి కేగితిని. ఈపరి నా వ్యవహారము నిమిత్తము పోయియుండలేదు. నిర్వికారునికార్యము నందే యుంటిని. ఈసారి నామనోభావ మన్యవిధముగ నున్నయది. ఆభావము నీపత్రమున వ్యక్తపఱుపజాల. నీ విచ్చోటికి విచ్చేసిన నుడువవలసిన వన్నియు సవిస్తరముగ విశదపఱచెద. కేవల మీ విషయముమాత్ర మిపుడు వ్యక్తపఱుపవలసి యున్నది. ఇంతటినుండి యేను నా యిచ్ఛాధీనుడను గాను. ఎచ్చటికి భగవంతుడు నన్ను దోడ్కొనిపోవునో యాస్థలమునకు బుత్తళికాన్యాయముగ ననుసరించెద. ఎద్దానిం జేయుమనునో యదియే బొమ్మవలె చేయవలసియుండును. ప్రస్తుత మీవాక్యార్థము గ్రహించుట నీపక్షమున గఠినము గా నుండును.

నేను నిన్నుపేక్షించి కార్యము చేయుచుంటినని నీవు మనమునం దలంచవలదు. ఇంతపర్యంతము నవిరుద్ధమున ననేకదోషముల జేసియుంటి. నీవందులకు నాయెడ నసం

త్కృష్టురాల వైతివి. అది స్వాభావికమే. ఇప్పుడు నాకిక స్వాతంత్ర్యము లేదు. ఇంతనుండి నాసకలకార్యములు నాయిచ్ఛాను సారముగ గాక ఈశ్వరాదేశమై యున్నవియని గ్రహించవలయును. నీ విచ్చటికి విచ్చేసినపు డాతాత్పర్యము నీకు హృదయంగమము గాగలదు. భగవంతుం డాతని యపారకరుణచే నే యాలోకనము నాకు జూపెనో నీకు నయ్యది చూపుననియే ఆశించుచున్నాను. అయిన నది యాతని యభీష్టమున నాధారపడియున్నది. నీవు నాసహధర్మిణివి కాగోరుదువేని నీశక్తికొలది ప్రయత్నింపుము. నీ యేకాంతయిచ్ఛాబలమున నీకుగూడ నాయేకాంత కరుణాపథమును సర్వేశ్వరుడు చూపవచ్చును. ఈపత్రము నెవరికిం జూపవలదు. ఏలనన, నేను లిఖించిన దంతయు నత్యంతగోప్యము. నీకుదప్ప మఱెవ్వరికిని జెప్పనైతిని. ఇవి చెప్పగూడనివి. ఈదిన మింతియే.

నీ స్వామి.

పునః:—సంసారసంబంధ విషయముల నన్నింటిని సరోజినికి వ్రాసియుంటిని. ప్రత్యేకము నీకు వ్రాయుట అనావశ్యకము. ఆలేఖాదర్శమున నన్నియు గోచర మగును.

బరోడానుండి పునహా బొంబాయిపట్టణములందు, అమరావతి నాగపురము మున్నగు ప్రదేశములందును శ్రీఅరవిందు లుపన్యసించుచు జాతీయవాద దుందుభుల మ్రోగించుచు నూతనోత్సాహమును బుట్టించి తన సంభాషణముల వినగలిగినవారి నెల్ల దేశారాధనాతత్పరులను



గావించి దిగ్విజయముగా యాత్ర సాగించి ౧౯౦౮ జన
వరి మాసాంతమునకు కలకత్తా వచ్చి చేరిరి. శ్రీ అర
విందులు బెనర్జి, పాలు మున్నగువారివలె వక్తృత్వపటి
మలో బ్రసిద్ధి బడయకున్నను వారి వాక్యములు హృద
యమునుండి వెడలి తిన్నగా శ్రోతల హృదయమున
నాటి పరివర్తన మందించునట్టి పవిత్రతా ప్రతిభగల
అపూర్వ భావగర్భిత పదజాలములు. ఆ దివ్య వాక్యా
నందు సూదంటురాయివలె శ్రోతలనాకర్షించు శక్తిగలదు.
ఇట్టి తన యుపన్యాసములమూలమున దేశమును ముఖ్య
ముగా వంగదేశము నుత్తేజిత లూగించిరి. ఈ
సమయముననే శ్రీ అరవిందుని ప్రతిభావిశేషములకు,
కార్యదీక్షకు, అపూర్వ జాతీయభావములకు, త్యాగ
మునకు ముగ్ధుడై ఆసియాఖండ కవిచక్రవర్తి యని
ఖండాంతరములందును కీర్తిమంతుడైన రవీంద్రుడు 'నమ
స్కార' అను శీర్షికక్రింద వంగభాషయందు రసవత్తర
మైన గీతమును రచియించి 'ఓ అరవిందా! రవీంద్రుని
వందనముల నందికొమ్ము' అని గాన మొనర్చియుండెను.
సూరత్ కాంగ్రెస్సు విధ్వంసమై మితవాదనాయకత్వము
తిరస్కృత మైననాటినుండియు జాతీయపక్షమును నిర్మూ
లింప మితవాదులు నానావిధముల బ్రయత్నింప సాగిరి.

ప్రభుత్వాధికారులు మితవాదులను జేరదీసి జాతీయ వాదులు తలలెత్తకుండ జేయుటకు వలయు కఠినశాసనముల బ్రయోగించుట, గృహముల శోధించి ముద్రణాలయముల పరిశోధించి ధరావత్తుల విధించి జాతీయవాదులను నానావిధముల శిక్షించుట, వందేమాతరమని కేకలు వేసిన పసిబాలురు కొరడాదెబ్బలకు బాల్పడుట, నిర్బంధ విధానమువలన దేశమందు ఘోరభయ మేర్పడి దిక్కుదోచకుండుట మున్నగు నాటి రాజకీయ చరిత్రమును వివరముగా వెల్లడించు కార్యము భావిచరిత్రకారునిది గాని మాది గాదు. ఆధ్యాత్మికప్రపంచమున నూతన పథము త్రొక్కి మానవప్రకృతినే పరివర్తన మొనర్చి దేవజాతిని భాగవతజీవనమును నెలకొల్పుటయే ప్రధానాశయము గాగల నేటి శ్రీ అరవిందజీవితమునందీవిషయముల కంత ప్రాముఖ్య మిచ్చుట ధర్మము గాదనియు తలంచెదము.

ఇట్లు శాసనబద్ధమైన ఆందోళనమున కంతరాయములు దొర్లి, రాజమార్గమున నోరెత్తి హృదయవేదనను వెల్లడించుటకు నేకార్యము చేయుటకును వీలులేని విషమస్థితి యేర్పడినకాలదియు రాజసగుణ ప్రేరితులగు కొందఱు యువకులు చిత్తశాంతి గోల్పోయి పాశ్చాత్య

పద్ధతులనే శరణ్యముగాగొని పశుబలముతో ప్రభుత్వము నెదుర్కొనవలయునని నిశ్చయించ నారంభించిరి. వారు నిరంకుశచర్యలకు పీడనమునకు ప్రతీకారముగా రష్యా దేశీయు లవలంబించిన విప్లవమార్గములే ఈ యువకవర్గ మున కాదర్శప్రాయములైనవి. తదాదర్శానుగుణముగా విధానముల నాలోచించి విప్లవసంఘముల నతిరహస్య ముగా నెలకొల్పుటకును, విదేశములకు గొందఱనంపి 'బాంబు' - ప్రేలుడుగుండ్లు - లను మారణసాధనముల తయారుచేయ నభ్యసించుటకును వలయు పన్నాగముల నన్నింటిని అల్లిరట. కొరడాదెబ్బలతో ఏకాంతవాస నిర్బంధములతో శిక్షితులైన యువకులు ప్రభుత్వో ద్యోగులను దొరలను రహస్యముగా హతమొనర్ప వలయునని నెత్తురుతో ప్రమాణపత్రములు వ్రాసికొని దీక్షబూనిరట. గవర్నరులు ఉన్నత ప్రభుత్వోద్యోగులు ప్రయాణమొనర్చు రైలుబండ్లను ప్రేలుడుగుండ్లతో ధ్వంసమొనర్చి వారిప్రాణముల నిలువున తీయుటకు కుట్రలు బన్నసాగిరట. ఉద్యోగులను రహస్యముగా నేమరపాటున నొంటరిగా జిక్కించుకొని హతమొనర్చు టకు యువకు లన్వేషింప దొడంగిరట. భయానకమగు నీ విప్లవకారుల కార్యములన్నియు కుట్రలన్నియు ప్రభు

త్వమువారు ప్రకటించిన 'రౌలట్' నివేదికయందు వివరముగా పేర్కొనబడి యున్నవి.

అన్నెము పున్నె మెఱుంగని 'కెన్నడీ' దంపతులను తమ్ము శిక్షించిన 'కింగ్సు ఫోర్డు' దంపతులుగా భ్రమించి కొందఱుయువకులు హత్యగావించిరి. ఈహత్యాదోషము పండియే ఆలిపూరు బాంబు కుట్రకేసుగా పరిణమించినది. ఈ విప్లవమునకు నాయకుడుగా నెన్నబడిన వరేంద్రుడు శ్రీ అరవిందులకు తమ్ముడను కారణముననో జాతీయవాదము నూరిపోసి స్వాతంత్ర్యాదర్శమును వెల్లడించి దేశీయులకు శివమెత్తించిన నాయకుడను కారణముననో మఱేకారణముననో ఈ కుట్రకంతయు సూత్రధారులు వీరేయని యభిప్రాయపడి ౧౯౦౮-వ సంవత్సరమున మేనెల ౨ తేది ఉషఃకాలమున నైదుఘంటలకు శ్రీ అరవిందులు నిద్రించుచుండగా పరున్నవారి నట్లే చేతులకు సంకెళ్లువైచి బంధించిరి. ఇంటిచుట్టును పోలీసువారు ముట్టడించి ప్రతిగదియు ప్రతిపెట్టెయు ప్రతివస్తువును శోధించిరి. ఇట్లు పరిశీలించి కొంపోబడిన కాగితములనుండియే మనకు కోర్టువారిమూలమున లభించిన - శ్రీ అరవిందులు ధర్మపత్ని మృణాళినీదేవిగారికి వ్రాసిన- దివ్యలేఖలు! ఐదుదినము లొకటిరెండు పోలీసుస్టేషను

లందు శ్రీ అరవిందులు నిర్బంధింపబడిన తరువాత మే నెల ౭ తేది మేజస్ట్రీటుకోర్టులో విచారణ ప్రారంభ మైనది. ఈ కేసును ప్రభుత్వపక్షమున వాదించి నిర్వ హించుటకు క్రొత్తమార్గమును ద్రొక్కి వంగప్రభుత్వము వారు మద్రాసునుండి సుప్రసిద్ధులు కీర్తిశేషులు నగు నార్టన్‌బారిస్టరును ప్రత్యేకముగా బిలిపించుకొనియుండిరి. ప్రతిదినము వేయిరూపాయలవంతున ఒకసంవత్సరము పాటు ప్రభుత్వమువారు వారికి కట్నమిచ్చి బహూక రించియుండిరి. శ్రీ అరవిందుల పక్షమున తగిన న్యాయ వాదిని నియమించి వారి నిర్దోషత్వమును ఋజువు చేయుట కనువుగా ధనసాయ మొనర్పవలసినదని శ్రీ అరవిందుల ప్రియసోదరి సరోజినీదేవిగారు దేశీయులకు విజ్ఞప్తిచేసికొనగా సుమారు ముప్పది నలువది వేలకు మించి ధనము ప్రోగైనది. దీనివలన శ్రీ అరవిందులపట్ల దేశీయులకు గల ప్రేమాదరణములే గాక వారి నిర్దో షత్వమందుగల విశ్వాసమును వెల్లడియగుచున్నది. శ్రీ అరవిందుల పక్షమున ప్రప్రథమమున సుప్రసిద్ధులై యుండిన వ్యోమకేశ చక్రవర్తిగారిని నియమించుకొన వలయునని ప్రయత్నములు జరిగినను తుద కకస్మాత్తుగా చిత్తరంజన్‌దాసు శ్రీ అరవిందుని న్యాయవాదిగా

కోర్టులో పనిచేయుట సంభవించినది. చిత్తరంజనుని కీర్తి ప్రతిభా సామర్థ్యములు నాటినుండియే దేశమున వ్యాపింపదొడగినవి. శ్రీ అరవిందుల కీ నేరవిచారణ సమయమున నలవడిన ఏకాంత కారాగారవాసము మహోపకారమే యయ్యెను. శ్రీరామదాసునకు చెఱసాలయందే శ్రీరామమూర్తి యనుగ్రహ దర్శనభాగ్యములు లభించినట్లు శ్రీ అరవిందుల కీ కాలముననే శ్రీ కృష్ణభగవానుని సాక్షాత్కార సందేశభాగ్యముల ననుభవించు మహద్భాగ్యము చేకూరినది. నిరంతరము కార్యకలాపమందు నిమగ్నులై యూపిరాడకుండిన శ్రీ అరవిందుల కీయేకాంత కారాగారవాసమున నంతర్ముఖులై యోగసాధనచేయుట కవకాశము లభించినది. ఈసాధన గుఱించియు, కారాగారమున తనకు కృష్ణభగవానునిచే ప్రసాదింపబడిన దివ్యానుభవముల దివ్యాదేశముల గుఱించియు శ్రీఅరవిందులు కారాగారము నుండి విడుదలయైవచ్చిన శీఘ్రకాలములోనే ఉత్తరపరయం దొసంగిన యుపన్యాసమున వివరించియున్నారు. ప్రథమమున ఆనాటి స్థితినిగుఱించి తోడి దేశసేవకుల వియోగమునుగుఱించి వివరించిన మిక్కిలి స్వల్పభాగము తప్ప తక్కిన యుపన్యాసమునంతను నీక్రింద బొందుపఱచుచున్నాము.

నన్ను పోలీసువారు పట్టుకొని లాల్ బజారుపోలీసుస్టేషనుకు త్వరితముగా తరలించుతరి నొక్కక్షణము పరమేశ్వరునిపట్ల నా విశ్వాసము చలించినది. ఏలనన వానిసంకల్పము నవలోకింపజాలకపోతిని. కావుననే క్షణకాలము సంకోచించితిని. "సర్వేశ్వరా! నాకు సంభవించిన దిది యేమి? నాదేశీయులకై నేనొనర్చవలసిన కార్య మొకటి యున్నదని, అది పరిపూర్తియొనర్పబడువఱకు తమచే పరిరక్షితుడనై యుందునని విశ్వసించితినే? అట్టిచో నిట్టినేరారోపణపై నే నిచట నెందుల కున్నాను?" అని భగవంతునిగూర్చి నా హృదయమందు మొర లిడితిని. అవల నొకటి, రెండు, మూడుదినములుగూడ గడచెను. అపుడు నాహృదయమునుండి "వేచియుండుము, వీక్షింపుము" అని యొకవాణి వినవచ్చినది. నేనంత ప్రశాంతుడనై ప్రతీక్షించితిని. లాల్ బజారునుండి ఆలిపూరుకు గొంపోబడితిని. మనుజులనుండి దూరీకృతుడనై యొకమాస మేకాంత కారాగారబంధమున నుంపబడితిని. అచ్చట నాయందంతస్స్థితమైన ఆభగవానునిదివ్యవాణి నాకర్ణించుటకై ఆభగవాను డాజ్ఞాపించున దేదియో అవగాహన మొనర్చుకొనుటకై నే నొనర్పవలసినదేదియో నేర్చుకొనుటకై అహర్నిశలు నిరీక్షించితిని. ఆ యేకాంతముననే ప్రప్రథమసాక్షాత్కారము, ప్రథమపాఠము నా కనుగ్రహింపబడినది. అప్పుడు నన్ను బట్టుకొనుట కించుమించు నెలదినములకు ముందుగా నే నెఱింగిన యొకవిశేషము నాకు జ్ఞప్తికి వచ్చినది. ఆ విషయ మేమన, భగవంతునితోడి యధికాధికసంబంధభాగ్యము నాకుగలుగుట కనువుగా నేకాంతవాసమునకు నే నేగుటకు, ఆత్మయం దంతర్దృష్టిచే సమీక్షించుకొనుటకు, నా కర్మకలాపము నంతను గట్టిపెట్టుటకు అంతర్వాణిరూపమున నా కొక యాదేశము వచ్చియుండెను. కాని బలహీనుడనుగానుండి యా యాదేశమును

దేశమం దుదయించియున్నను సమీపమందున్న ద్రావిడాంధ్ర కేరళ మలయాళీల సంఖ్యమాత్రము క్రమక్రమముగా స్వల్పమై పూజ్యముగానున్నది. ఇట్లు భారతీయులే గాక యూరోపు అమెరికా దేశీయులును - స్త్రీ పురుషులు - కొందఱు గలరు. హిందువులు, బౌద్ధులు, జైనులు, పారశీకులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నిట్లన్ని మతములవారును గలరు. కాని ఆశ్రమము ప్రవేశించిన తరువాత నే మత సంప్రదాయములును పాటింపబడవనియు శ్రీ అరవిందుల శిష్యవర్గముగా మాత్రమే పరిగణింపబడుననియు తెలియుచున్నది.

ఈయాశ్రమమందలి సాధకులలో విద్యాధురీణులు, మేధావంతులు పలువురుగలరనియు, అసాధారణ ప్రతిభగల కవులు, గాయకులు, చిత్రలేఖకులు, కళానిపుణులు కొందఱుగలరనియు యోగోపాసనయందు, భగవదారాధనయందుమాత్రమే ఆత్మార్పణముగా వినియోగించు వారి శక్తిసామర్థ్యములు దివ్యపరిణామమును గాంచుచున్నవనియు స్వానుభవముగలవారు పలువురు వెల్లడించియున్నారు. సాధకులందఱకును గురువు ప్రభువు శ్రీఅరవిందులేగాని మధ్యపెత్తనము పౌరోహిత్యము నెవరికిని లేదు. భక్తిజ్ఞానము లుపాంగములుగా నున్నను

కర్మయే శ్రీఅరవిందుల యోగమందు ప్రాధాన్యము వహించియున్నందున సాధకులు సాధనగా తమ గురువర్యు లాదేశించిన కర్మల నాచరించుటయందే నెక్కువ కాలము గడపుచుందురు. శిష్యులలో సమానప్రతిపత్తియే ప్రతివారికిని గలదుగాని ఎక్కువ తక్కువ లేమాత్రమును లేవు. బాహ్యనియమము లంతగా నీయాశ్రమమందు గనుపించకున్నను బ్రహ్మచర్యమందు పట్టింపు తీవ్రముగా గలదు. దంపతులుగా నుండిన వారును గొందఱు కలరు. కాని యొకానొకని కళత్ర సంతాన మని, బంధుమిత్రు లనిమాత్రముగాక ఆ యా వ్యక్తుల కీ సాధనయందు యోగమునందు గల అభీప్స ననుసరించియే యోగ్యతనుబట్టియే ఈయాశ్రమ ప్రవేశమున కవకాశము గలదు. స్త్రీలకు సాధారణముగా ప్రత్యేకగృహములందు బస లొసంగబడుచున్నవి.

ఇక ఆశ్రమమం దొసంగు నాహారవిషయమును గుఱించి. అన్నింటిని త్యజించి యోగముకొఱకే యాశ్రమమున శరణజొచ్చిన వారివిషయమున రుచుల కంత ప్రాముఖ్య ముండజాలదు. అయినను అటనొసంగు నాహారము బలకరము నారోగ్యప్రదమునై శుచిగా

నుండును. యోగసాధనకు కేవలము సాత్త్వికాహారమే యుండితీరవలయునను నియమముకంటె భిన్నభిన్నరుచుల కలవడిన పాశ్చాత్యదేశీయులకు భరతఖండములోని నానారాష్ట్రవాసులకు అందఱకు నింపితముగా ననుకూలముగా నుండవలయునను సమన్వయసిద్ధాంత మనుష్ఠింపబడుచున్నది. కాని మాంసాద ఆహారములు (కోడిగ్రుడ్డు సహితము) నిషిద్ధములు. మిరపకాయలు, ఉల్లిపాయలు, ఇంగువ, ఆవాలు మున్నగు ఘాటుపదార్థముల నుపయోగింపరు. చింతపండుకు బదులుగా నిమ్మకాయల నుపయోగింతురు. పండ్లు, పాలు, పెరుగు, రొట్టె, వరియన్నము, పప్పులు, కూరలు ఇవియే ముఖ్యములు. ఆహారవస్తువుల పరిశీలించి శుభ్రపఱచుట, గోధుమపిండి తయారుచేసి రొట్టెలుచేయుట, వంటచేయుట, వడ్డించుట తుదకు వంటకు చేరుడుబియ్యమును దంచి తయారుచేయుట, భుజించిన పాత్రలను శుద్ధిచేయుట సర్వము నాశ్రమ సాధకీ సాధకులే చేయుచుందురు. కార్యకలాప మంత బాహుళ్యముగానున్నను ఈయాశ్రమమందుగల ప్రశాంతి వాతావరణము నిరుపమానము. వంటశాలయందుగాని భోజనశాలయందుగాని మఱేకార్యరంగమందుగాని శాంతిసౌరభములే వెదజల్లుచుండును. మామూలు హడావిడి,



శ్రీ అరవిందాశ్రమము, ఉత్తరముఖము

అట్టహాసములు నుద్వేగవిశేషము లేవియు గనపడవు. కార్యనిమగ్నులగు సాధకులు కర్తృత్వమును తాము వహించక ఏమహాశక్తియో, దివ్యప్రజ్ఞయో తమచేత చేయించుచున్నదని తాము నిమిత్తమాత్రులమని భావించి శాంత్యానందముల ననుభవించుచుందురు.

ఆశ్రమ గృహముల ప్రత్యేకవిశేషము వాని శుభ్రత యందు. ఆశుభ్రతను బట్టియే ఆశ్రమగృహము లివిగదా యని ప్రేక్షకులు గుర్తించగలరు. పూదోట లేని ఆశ్రమగృహమే లేదని చెప్పవచ్చును. ప్రతిగృహమందు నానావిధములైన సజాతీయ విజాతీయ పూమొక్కలు కనుంపండువుగా కమ్మనివాసనల నీనుచు చూపరుల కానందము గొల్పుచుండును. ఆశ్రమ పూదోటలం గల నానావిధ పుష్పజాతులు మఱెచ్చటను గానరావనియు నట సుమారు మూడువందల భిన్నభిన్నజాతుల పుష్పములు గలవనియు ప్రతిపుష్పమునకు నొక్కొక్క చిహ్నము, గుణము గలదనియు—'తులసి' భక్తిచిహ్నముగా 'గులాబి' సమర్పణచిహ్నముగా నెన్నబడునట్లు — పుష్పముల కెక్కువ ప్రాముఖ్యము గలదనియు తెలియుచున్నది.

ఇక శ్రీఅరవిందులను దర్శించువిషయమున నొక్క

మాట. శ్రీఅరవిందులు ౧౯౨౬ వ నవంబరు తే ౨౪ ది ఏకాంత వాసము ప్రారంభించినప్పటినుండియు నెవరికిని గనపడుటలేదు. వారి నాశ్రయించి ఆశ్రమమందున్న శిష్యులకేని సంవత్సరమునకు మూడుపర్యాయములు మాత్రమే శ్రీఅరవిందులను దర్శించు భాగ్యముగలదు. అప్పుడైనను నిముసకాలము శిష్యులొక్కొక్కరు భక్తితో శ్రీఅరవిందులను సమీపించి వారి పాదారవిందములకు నమస్కరించుటయు శ్రీఅరవిందులు తమదివ్యహస్తముతో స్పృశించి శిష్యుల నాశీర్వదించుటయుమాత్రమే. సంభాషించుటగాని సన్నిధానమున నొక్కింత సేపుండుట గాని సంభవింపదు. కాని ౧౯౨౮ - వ సంవత్సరము మేనెలలో శ్రీఅరవిందు లేకాంతవాసము స్వీకరించిన స్వల్పకాలమునకే రవీంద్రకవి శ్రీవారిని సందర్శించ నభిలషించి యనుమతికి వ్రాసికొనినట్లును, అపు డెవరిని చూడరాదని ఎవరితోడను మాటాడరాదని తా మేర్పఱుచుకొనిన నియమమునకు శ్రీ అరవిందులు మినహాయింపుగావించి రవీంద్రుని కవకాశ మిచ్చినట్లును దెలియుచున్నది.

ఆవల ఈ దర్శనవిషయమై రవీంద్రు డొక రసవత్తరమైన వ్యాసము రచించి శ్రీ అరవిందుని

స్తుతించి యుండెను. అందు చిరకాలముగా శ్రీ అరవిం దుని జూడవలయునను అభిలాష తీవ్రముగా తమ కుండె ననియు, నా దది సిద్ధించెననియు, శ్రీ అరవిందుని దర్శించినంతనే అంతర్జ్యోతి వారిముఖకమలమున బ్రకా శించుచుండినట్లు, వా రాత్మోపలబ్ధికై చేసిన ప్రయత్నము పరిపూర్ణముగా ఫలప్రదమైనట్లు, వారి యోగలక్ష్య మీ లోకమం దీ శరీరముననే అహంకార వర్జితము పరమవిజ్ఞాన విలసితము నగు పరిపూర్ణవిలాసమును సమ గ్రముగా నిత్యజీవితమందు ప్రతిష్ఠించుటయే గాని ఏదో పరమని పలాయనమగు సన్న్యాసము గానట్లు, ఆత్మను క్షోభపెట్టు త్యాగము బాధానుభవము నివియే పరమార్థములుగా భావించు యూరోపియన్ మతా చార్యుల వద్దనుండి - రషియా క్రైస్తవ సన్న్యాసుల నుండి- శ్రీ అరవిందు లేనాడును పాఠముల నేర్చుకొన నట్లును వారి సాన్నిధ్యమందు తమకు ప్రత్యక్షమై నిందు విశ్వాస మేర్పడినదనియు రచియించియుండిరి. మఱియు నత్యంత అగాధమగు పరమప్రశాంతినుండియే శబ్దము, వాక్కు వెలువడు చున్నదనియు ఆ వాక్కునుండియే నూతన ప్రపంచసృష్టి యుత్పన్నమగుచున్నదనియు అట్టి దివ్యవాక్కు శ్రీ అరవిందుని యందున్నదనియు రవీంద్రు

డిట్లు వెల్లడించెను "ఆవాక్కు మీ యందున్నది. దానిని మీనుండి గ్రహించి శిరసావహించుటకు మేము ప్రతీక్షించుచున్నాము. 'సన్నాలకింపు' డని భరత ఖండము మీ కంఠద్వారమున ప్రపంచమున కుపదేశించుచున్నది". లోగడ బెరొక్కనినట్లు 'ఓ అరవిందా! రవీంద్రునివందనముల నందికొమ్ము' అని రవీంద్రుడు తనలో తాను భక్తిమెయి పురశ్చరణమొనర్చి కీర్తించితిమనియు వ్రాసియుండిరి.

శ్రీవారిని దర్శించగల యవకాశము మూడు పర్యాయములే. అవి ఫిబ్రవరి తే ౨౧ ది, ఆగస్టు తే ౧౫ ది, నవంబరు తే ౨౪ ది. ఆసమయములం దాశ్రమమందున్న శ్రీవారిశిష్యులేగాక దూరప్రదేశములందున్న శిష్యకోటిలో పలువురు దర్శనభాగ్యము నందుచుందురు. ఈదర్శనములు యోగసాధనజేయు శ్రీ అరవిందశిష్యుల నిమిత్తమే యుద్దేశింపబడినను, ఆశ్రమముతో నేదో యొకసంబంధముగలవారు ఆశ్రమాభిమానముగలవారు పలువురు ముందుగా ననుమతిబడసి ఆ సమయమున వచ్చుచుందురు. ఫిబ్రవరి నవంబరు దర్శనములకు మాత్రము శ్రీవారి శిష్యులకుతప్ప నితరుల కనుమతి లభించుట మిక్కిలి కష్టమనియు ఆగస్టు దర్శనమున

కితరులకును కొంత అవకాశ మున్నదనియు తోచుచున్నది.

## శ్రీ అరవిందోపదేశము

శ్రీ అరవిందులు స్వప్రయత్నమున యోగమారంభించి ముప్పది సంవత్సరములు మాత్రమే దాటిన శ్లోక కాలనిర్ణయము ప్రత్యక్షముగా గనబడు చున్నను ఆజన్మముగా వారియందు యోగబీజము లంకురించి యభివృద్ధిగా నారంభించినట్లును పదునాల్గు పదునెనిమిది సంవత్సరముల చిఱుప్రాయముననే, అనగా నేటి కేబది సంవత్సరముల క్రిందటనే, వారి కంఠస్స్థితముగా నొక యాదేశము, ఒక కర్తవ్యము సువ్యక్తమైనట్లును శ్రీ వారి లేఖలే సూచించుచున్నవి.

మన కంటికగపడు జగద్రూపముల కావల, ఆత్మచైతన్యముల సత్యము ఏకము నిత్యము నగు సర్వభూతాత్మ కలదను ఆర్యావర్తపు ఋషుల సిద్ధాంతము నుండియే శ్రీ అరవిందుల యుపదేశము ప్రారంభ మగుచున్నను లక్ష్యలక్షణము లందు వైలక్ష్య విశేషములు లేకపోలేదు. ప్రపంచమును గుఱించిన భావము లింత

వఱ కించుమిం చీవిధమున ద్వివిధరూపముల వెల్లడింప బడియున్నవని చెప్పనొప్పును.

అందు బుద్ధుని, శంకరుని భావ మీవిధమై యుం డుట మొదటిది: ప్రపంచము మాయ, భ్రమ, అజ్ఞాన క్షేత్రము. ఆ అజ్ఞానమువలననే బాధాకరమును. సాధ్య మైనంత త్వరితముగ నీజగత్తునుండి తప్పించుకొనిపోవుట, ఆద్యమైన అవ్యాకృతమైన సత్తునందో అసత్తునందో మాయ మగుట, ఇది యొక్కటియే మన కర్తవ్యము.

సాధారణముగా గ్రహింపబడిన వేదాంతమార్గ మీ రెండవది: భగవానుడు సర్వవ్యాపిగాన జగత్తు గూడ మూలతత్త్వమున నిశ్చయముగా భగవంతుడే. కాని ఆజగద్బాహ్యరీతి - వెలుపలి ఆవిష్కారము - వికృ తమై, మఱుగై, అజ్ఞానమయము తికమకలు నై యున్నది. ఇట్టి జగద్విషయమై శ్రమపడి క్షోభనందక అంతస్స్థిత పురుషుని భగవానుని ఎఱుంగుట, ఆతని దివ్యప్రజ్ఞ కలిగియుండుట, ఆ అంతస్స్థిత ప్రజ్ఞయందే స్థిరపడి యుండుట, ఇదియే మనకర్తవ్యము. ఏలనన బాహ్య జగత్తు మాఱజాలదు. అది నిరంతరము తన నైజస్థితి యగు నిశ్చేతనమందే, అజ్ఞానమునందే యుండును.

ఇక శ్రీ అరవిందుని భావము సూక్ష్మముగా నిది:

జగత్తు, నేడున్న విధమునుబట్టి, మొదట నిజముగా సంకల్పించినట్లు భగవానుని సృష్టిగా గాక, ఒక అప్రకాశము, అభాస, వికారము యొక్క వెలువరింతగా నున్నది. ఇది భగవచ్చైతన్యముయొక్క భగవదిచ్ఛయొక్క వెలువరింత ఆవిష్కారము గాదు. కాని అట్లు భగవదిచ్ఛానుసారము కావలయుననియే దాని యుద్దేశ్యము. ఈ జగత్తు, భగవానుని సమస్త సుస్వరూపములతో సర్వలక్షణములతో, అనగా ఆ దివ్యతేజము, దివ్యజ్ఞానము, దివ్యశక్తి, దివ్యప్రేమ, దివ్యసౌందర్యములతో లోపరహితము సంపూర్ణము నైన భగవదావిష్కారములోని పరిణామాభివృద్ధి గాంచుటకే సృష్టింపబడినది.

పైని సూచించిన ప్రథమ ద్వితీయ భావములు రెండును తత్త్వజ్ఞలోకమునకు సుపరిచితములైనవే. అందువలన నిట శ్రీ అరవిందులు సూచించు తృతీయ దృక్పథమునుగుఱించియే కొంత వివరించవలసియున్నది. జగన్మిథ్యాత్వ సూత్రమున కిట నాదరము లేకపోవుటయేగాదు, తిరస్కారమును గలదు. మాయావాదము పరిపూర్ణసత్యము కాదనియు సాధనావస్థయందు ఖండానుభవమువలన గనుగొనిన యొక ఖండ సత్యమనియు మాయ యొక యనుభూతి యనియు, శంకరునకు సాధ

నావస్థలో నొకప్పుడు స్ఫుటముగాగోచరించిన ముఖ్యాను భూతి యగుటచేత వా రట్లు దానిని గట్టిగా నొక్కిచెప్పి రనియు శ్రీ అరవిందుల భావమై యున్నది. పదునైదు సంవత్సరముల క్రిందట రచించిన 'యోగము - దాని లక్ష్యము' (Yoga and its objects) లను గ్రంథమున శ్రీ అరవిందు లీవిషయమై రచించినభాగమును గొంత అనువదించి ఈ క్రింద నుదాహరించుచున్నాము.

"ఎట్టి దేశకాలాది సన్నివేశముల మూలమున బ్రహ్మము తనంత దాను బహిర్గత మగుచున్నదో దాని నుండి బ్రహ్మముయొక్క విముక్తియే మాయ; అంత కంటె మఱేమియు గాదు. ఆయనను గుఱించి మనము చూచి భావించు దాని కేవిధమునను ఆయన బద్ధుడు కాడు. ఆ మాయనుండియే మనము తప్పించుకొనవలసి యున్నది. స్వతంత్రమును బంధయుక్తముగను, అపరిమిత మైనదానిని నిజముగా పరిమితిగలదిగను, పదార్థములుభగ వానుడు చైతన్యముగాక ప్రత్యేకముగానుండియున్నట్లును గ్రహించు అజ్ఞానమే మాయ. గోపికల శ్రీకృష్ణుని గుఱించిన కథలో నారదుడు, తాను ప్రవేశించిన ప్రతి ఇంటియందును శ్రీకృష్ణుడు వేఱువేఱుగా నివసించి యుండుట ప్రతిగోపికకును భిన్నరూపముతో ప్రత్యక్షమై

యుండుట ఇట్లయ్యె నెల్లపుడదే శ్రీకృష్ణుడగుట ఎల్లు కనుగొనినదియు మీకు జ్ఞాపకమున్నది గదా. మీరెఱిం గిన ఆకథా సందర్భములోని భక్తిభావ మటుండనిండు; అందు భగవానుని జగల్లీలయొక్క చక్కని ప్రతిబింబము గలదు. సర్వము నాయనయే; చూచుటకు వేర్వేఱుగా గనపడు ప్రకృతితోడను కర్మతోడను సంబంధముగల సర్వము, ప్రతిపురుషుడును ఆయనయే. ఐనను, అదే ముహూర్తమున పరాప్రకృతియగు రాధాసహితుడై యున్న పురుషోత్తముడును ఆయనయే. తన ఇష్టము వచ్చినపుడు తనలోనే వీని నన్నింటిని ఉపసంహరించు కొనగలడు; తిరిగి ఇష్టము వచ్చినపుడు వానిని బహిర్గత మొనర్పగలడు. ఒకదృక్పథమునుండి అవి వానితో నేకమే, మఱొక దృక్పథమునుండి ఏకమయ్యును భిన్నము, ఇంకొక దృక్పథమునుండి ఎల్లప్పుడు భిన్నమే; ఏలనన, ఆయన ఇచ్ఛానుగుణముగ నిగూఢముగనో ప్రకాశము గనో అవి ఆయనయం దెల్లప్పుడు నున్నవి. ఈ దృక్పథ ములను గుఱించి వివాదపడుటలో లాభ మేమియు లేదు. భగవానుని సాక్షాత్కరించుకొనువఱకు నిజాత్మను భగ వానుని ఎఱుంగువఱకు ఓపికబట్టియుండుము. అపు డిక చర్చ, వాదము ననవసరమగును."

ఈ మాయావాద మాహాత్మ్యముననే అధ్యాత్మ చింతనాబలముగల ప్రతిభాశాలులు, అహమును జయించి నిర్మమత్వబుద్ధితో సర్వము త్యజించిన మహానుభావు లెందఱో సన్న్యాసముస్వీకరించి ప్రపంచమును బహిష్కరించిరి. ఇందువలన మానవాభ్యుదయమునకే సర్వవిధముల నష్టదాయకమైనది. జడమని వ్యవహరింపబడు భౌతికమునందును భగవచ్ఛక్తి ఆ చైతన్యము గలదు. భగవ దంశలేని దెచ్చటను ఉండజాలదు. కాని యది నిమగ్నమై బాహ్యమునకు గోచరించుట లేదు. సర్వత్ర భౌతికమునకు నాధ్యాత్మికమునకును గల సన్నిహిత అవినాసంబంధమును దాని యంతరములను వికాసమును వెల్లడించుటయందే శ్రీ అరవింద విధానమందలి విశేషము. ప్రపంచము వ్యర్థముగా సృష్టింపబడలేదు. ఇది నిమగ్న చైతన్యావస్థలో నుండి సర్వత్ర దివ్యచైతన్యమును క్రమక్రమముగా నావిష్కరింపజేయుటకు వలయు నాధ్యాత్మిక పరిణామరంగమై యున్నది. ఈ పరిణామ ప్రక్రియలయందు పరమాత్మ చైతన్య విముక్తియొక్క ప్రథమసోపానము ప్రాణము. ద్వితీయ సోపానము మనస్సు. కాని పరిణామము మనస్సుతోడనే సంపూర్తి కాజాలదు. అనంత శక్తిమంతుడగు భగవల్లీలావిలాసము

మనస్సుతోడనే యంత మొందు చున్నదనుట మన యజ్ఞానమేగాని సత్యముగాదు. ఆ పరిణామము ఒక మహత్తరస్థితిగా ఆధ్యాత్మికమును విజ్ఞానమయమునగు చైతన్యముగా బహిర్గత మగుటకు నిరీక్షించుచున్నది. చైత్య పురుషునియందు ప్రబలశక్తిగా విజ్ఞానాత్మలవికసనము పరిణామమందలి తదనంతరసోపానమై యుండవలయును. అపుడే యీ విశ్వపదార్థములందు నిక్షిప్తమైయుండు ఈశ్వరతత్త్వము సంపూర్ణముగా స్వయం విమోచనము నందును. ప్రాణశక్తి కపుడే తన పూర్ణత్వమును ప్రదర్శింప సాధ్యమగుచున్నది.

పరిణామ క్రమ మందు మనోభూమికనుండి యావిర్భవించిన మనస్సు నే డత్యంత యుచ్చస్థితి యందున్నదని దానిమూలముననే ఆధునిక భౌతిక జ్ఞానము మిన్నుముట్టి కని విని యెఱుంగని యద్భుతముల నొనరించుచున్నదని మనము విస్మయ మందుచున్నాము. కాని మనస్సు ఒకానొక స్థితికే పోగలదు. తదనంతరము తా నున్నరీతిలో ముందుకు పోజాలక యుండే చక్రాకారముగామాత్రమే పరిభ్రమించుచుండును. పరిమితి మీద విభాగము మీద మన స్సాధారపడియున్నది. అది యేదో యొక నిర్దిష్టస్థానమునుండిమాత్రమే అపరార్థ

స్థితియందు వ్యవహరించగలదు.

మనస్సునందెన్నియో యంతరములు భూమికలు గలవు. శుద్ధ మనస్సు (Pure-mind), ఉన్నత మనస్సు (Higher-mind), స్వతఃస్ఫురణ మనస్సు (Intuitive-mind) అని కొన్నింటిని ఏదోయొకవిధముగా పాశ్చాత్యలోకమును నేడు గ్రహించినది. ఇంకను ఊర్ధ్వ భూమికలపైనున్న అతీతమనస్సు (Over-mind)ను మన పూర్వఋషులు గుర్తించియున్నారు. ఇది అపరార్ధమున పైన చివరమెట్టుగానున్నది. ఇట పరిపూర్ణము నవిసంవాదము నగు విజ్ఞానసత్యము భాగములుగా విభాగమై ప్రవేశించుచున్నది. పూర్వ హైందవ సంప్రదాయము అతీతమనోభూమికకు, విజ్ఞానభూమికకు (Supramental plane) గల అంతరములను గుర్తించినట్లులేదు. అందువలననే అతీతమనఃస్థితికి సంబంధించిన పాక్షికశక్తివలన సంపూర్ణసత్యము కుంటువడి తికమకలపాలై, ఆస్థితియే మాయ యని అదియే పరమాత్మోత్కృష్టమైన క్రియాశక్తియని అంగీకృతమై పరివర్తనారహస్యమును గోల్పోయినది. ఈ అతీత మనోభూమిక (Overcmental plane) కావల మహాల్లోకమున పరార్థమునందు సచ్చిదానందములకు

సన్నిహితసంబంధమైన విజ్ఞానభూమికలో విజ్ఞానము (Supermind) ఒండు కలదనియు అది యా విజ్ఞాన భూమికనుండి యావిర్భవింప ప్రయత్నించుచున్నదనియు, ఆవిజ్ఞానము సదా సత్యచైతన్యమయముగా నుండు ననియు ఆ విజ్ఞానమున కధిరోహించి యట దానిని వ్యష్టిగా ననుభవించుటగాక ఆవిజ్ఞానశక్తిని ఇట క్రిందికి కవరోహింపజేసి భౌతికమున స్థాపించుటవలననే అంతఃస్థితియందు, అపరార్ధమందు అపరాప్రకృతికి బద్ధమైయున్న మనఃప్రాణశరీరములు పరివర్తనమంది పరిశుద్ధములై దివ్యోపకరణములై దివ్యజీవనము సాధ్యము గాగలదనియు, నపుడే ఈ ప్రపంచప్రహేళిక (Riddle of this world) సాధింపబడి అమృతత్వము నిత్యానందము ననుభవించుచు స్వారాజ్య సామ్రాజ్యసంపన్నులము గాగలమనియు శ్రీ అరవిందులు సిద్ధానుభవులై చాటుచున్నారు.

తొల్లింటి వేదఋషులుగూడ నీ విజ్ఞాన (Supermind) శక్తిని చూచాయగా సమీపించి దర్శించి వ్యష్టిగా బ్రహ్మానందము ననుభవించుటయే లక్ష్యముగా బెట్టుకొనిన ట్లున్నదిగాని ఆ దివ్యశక్తిని భూచైతన్యమున కవరోహింపజేసి ఇట ప్రతిష్ఠించుటకు ప్రయత్నించియుండి

నట్లును గనబడదు. మఱియు నీవిజ్ఞానమునకు సాంకేతిక మగు సూర్యమండలము భేదించి సత్యలోక వర్తనులగు వారు సశరీరముతో నిట తిరిగివచ్చుట అసాధ్యమనియే సూచించు ఉపనిషద్వాక్యములును గూడ కలవని తెలియుచున్నది. పరార్ధమందలి ఈ పరమవిజ్ఞానమును కనుగొనుటయేగాక ఆవిజ్ఞానశక్తివలననే సశరీరముగా నీ భూలోకమందు దివ్యజీవనము ననుభవించుచు పరమేశ్వరుని దివ్యలీలలకు పాత్రులమై యుండవలయునే గాని ప్రపంచమును పరిత్యజింపరాదని నిరూపించుట, అందుకువలయు సమగ్రసాధనమును సహేతుకముగ వెల్లడించుట, ప్రాచ్యపాశ్చాత్యఖండముల ప్రబలి యుండిన సమస్తదర్శనముల పరిశోధించి వానివాని యథార్థతత్త్వ మిదియని నిర్ణయించి వానినిసంయోజన మొనర్చుట వీనియందే శ్రీఅరవిందుల ప్రత్యేకత ప్రతిభ గలదు. శ్రీఅరవిందులు రచించిన భాగవత జీవనము(The Life devine) వేదరహస్యము (Secret of the Veda) ఈశోపనిషద్వ్యాఖ్యానము మున్నగు గ్రంథముల పఠించిన మన మీ తత్త్వవిచారమును గ్రహించగలము.

ఇక శ్రీ అరవింద యోగమును గుఱించి:

అనుష్ఠాన ప్రధానమగు యోగమును వట్టిమాటలతో వర్ణించుట అంత ప్రయోజనకారిగాదు, సాధ్యమును గాదు. పూర్వ యోగములకు వీరియోగమునకు ఆదర్శ విధానములందు భేదము గలదు. హఠయోగ రాజయోగాదుల వలె ఏ కాయశుద్ధియో మన శ్శుద్ధియో ప్రధానముగా భావింపక సమస్త యోగముల ప్రధానప్రయోజన మందిమిడియున్నదని మనః ప్రాణ శరీరముల సంపూర్ణవికాసమును దివ్యత్వమును లక్ష్యముగా నుంచుకొనియున్నదని కాబోలు శ్రీవారి యోగము పూర్ణయోగమని వ్యవహరింపబడుచున్నది. కొందఱు సర్వయోగములసంకలనము సంయోజనము నిందున్నదని యోగసంకలనమనియు యోగసంయోజన మనియు నామకరణ మొనర్చియున్నారు.

కేవల మజ్ఞాన భూయిష్ఠమైన ఈ భౌతిక ప్రజ్ఞ నుండి దివ్యప్రజ్ఞ కధిష్ఠించుటమాత్రమేకాక ఆ దివ్య ప్రజ్ఞయొక్క పరమవిజ్ఞానశక్తి (Supermind)ని అజ్ఞాన యుతమగు మనఃప్రాణశరీరములలోనికి అవరోహింపజేసి వానిని పరివర్తన మొనరించి ఇచ్చట భగవానుని ఆ విష్కరింపజేయుట, ఈభౌతికమున దివ్యజీవనము సృష్టించుట, సంపూర్ణముగా తన్నుదా భగవంతుని కొక్క

నికే సమర్పించుకొనుట, ఆభగవచ్ఛక్తితో నైక్యమై తన్మూలమున ఆపరమవిజ్ఞానమయుడైన భగవానుని విశ్వాతీతమైన ఆసమస్త తేజమును, శక్తిని, విశాలతను, శాంతిని శుద్ధిని చైతన్యమును మనలోనికితీసికొనివచ్చుట ఇదియే ఈ యోగలక్ష్యమని శ్రీఅరవిందులు వెల్లడించి యున్నారు. మఱియు తమయోగము భగవానునికొఱకే గాని మానవుని స్వోపయోగమునకు కాదనియు మనము కాంక్షించునది మనస్వకీయావిష్కారమును, పరిమితుల నుండి బంధములనుండి విముక్తమైన వ్యక్త్యహంకారము యొక్క ఆవిష్కారమును గాక భగవదావిష్కారమునే అనియు, ఆభగవదావిష్కారమునందు మన సొంత ఆధ్యాత్మికముక్తి, శుద్ధి, సిద్ధి, యొకఫలము అంశము మాత్రమేఅనియు, ఆమన ముక్తి శుద్ధి సిద్ధులుగూడ మనకొఱ కనగా మన ఇష్టమువచ్చినట్లుపయోగించు కొనుటకుగాక భగవానునికొఱకు భగవత్ప్రీత్యర్థ మన్యే అనియు శ్రీ అరవిందులు స్పష్టముగా సెలవిచ్చి యున్నారు. శ్రీ వారియోగముయొక్క మాహాత్మ్య మును అందలి యపూర్వవిశేషములను మా వట్టిమాట లతో వర్ణించుటకన్న శ్రీవారివాక్యముల నట్లే యుల్లే ఖించుట ముఖ్యమని గతసంవత్సరము ప్రకటితమైన

శ్రీవారి యొక్కయుత్తరములోని కొంతభాగము నిట అనువదించి యుదాహరించుచున్నాము.

అన్ని యంశములందును నా యోగము కేవలము క్రొత్త యని నే నెన్నడు నుడువలేదు. దానికి పూర్ణయోగమని నామకరణ మొనర్చితిని. అట్లొనర్చుటలోనే పురాతన యోగములసారమును వానినుండి యనేకపద్ధతులను అది గ్రహించినట్లు తెలియగలదు; దాని నవీనత్వము, దాని లక్ష్యమందును దానిని గుఱించిన దృక్పథ మందును, ఆపద్ధతియొక్క సమగ్రతయందును గలదు. 'రిడిల్', "లైట్సు" లోనగు గ్రంథములందుగాని ప్రకటింపనున్న నూతన గ్రంథమునందుగాని యోగముయొక్క ప్రారంభదశలనుమాత్రమే నేను వివరించియున్నాను. అం దాయోగముయొక్క విస్తృతిని సూచించు నాదర్శము, ఆయోగవృత్తులందలి భావము, ఆయోగము లక్షించు నంతిమవిశేషము, మఱియు నాత్మవిచారవిధానము, దాని నిర్వహణము ఇవితప్ప పూర్వయోగములనుండి ప్రత్యేకభేదమును జూపించున దేదియును లేదు. ఆనవీనత్వవిషయము నీయుత్తరము లందు క్రమరీతిగాగాని ఏదోయొకపద్ధతి ననుసరించిగాని విపులీకరింప బడలేదు, సాధ్యమునుగాదు. అందువలన నింతకుముందే బుద్ధిపరిచయ మునగాని కొంత అనుష్ఠానమునగాని అలవాటుపడని వా రావిషయ మును గ్రహించలేరు. ఇంతవఱ కవిదితము ననాక్రాంతమునగు సీమను బ్రవేశించెడి యీయోగముయొక్క యుత్తరోత్తరదశల విధా నముగాని, వివరముగాని నేను బహిరంగపఱచలేదు, ప్రస్తుత మట్లొనర్ప నే నుద్దేశించను లేదు.

ఇదే మాదిరి పైకి కనబడు లక్ష్యములు, భావిసూచనలు — కొన్నియోగమతముల ననుసరించి (మానవ) జాతియొక్క పూర్ణ

త్వము, కొన్ని తాంత్రికసాధనములు, సంపూర్ణకాయసిద్ధినందుటకు ప్రయత్నము మున్నగునవి — ఉన్నవని నాకుగూడ చక్కగా దెలియును. వీనినిగుఱించి నేనే పేర్కొనియున్నాను. కేవలము ప్రపంచమున కావల దైవత్వసిద్ధిగాంచుటకు మాత్రమేగాక భూ(మి) చైతన్యము పరిణామధర్మానుసారముగా నింకను నిర్వహించవలసి యున్న ఆయుత్తరపక్షము నందుటకుగూడ జాతియొక్క ఆధ్యాత్మిక పూర్వదశ ప్రకృతిప్రయత్నముగానుండి యున్నదను భావమును గూడ నేను వెల్లడించియున్నాను. అందువలన ఆయాదర్శములు నాదానితో సమాంతరములయ్యు నయ్యదియే గాకపోయినప్పటికిని, నాయోగము దానిలక్ష్యము, దానివిధానము నూతనమని యంగీకరించి నను అంగీకరించకున్నను నే నేమాత్రము సరకుగొనను; అది యొక యల్పవిషయము. కాని దాని నంగీకరించగలవారుగాని దాని ననుష్ఠించ గలవారుకాని ఆవిషయము సత్యమని గుర్తించుట, అదియే కార్యసిద్ధి వలన సత్యముగా స్పష్టపడుట, ఇదియొక్కటియే ముఖ్యవిషయము; నవీనమనిగాని విస్మృతమైన పురాతనయోగమునే తిరిగి వల్లించుట యని లేక పునరుద్ధరించుటయనిగాని ఎట్లు పేర్కొనినను ప్రమాద మేమియు లేదు. నాదృష్టియందు పూర్వయోగముల లక్ష్యమును భావమును తిరిగి యట్లే చర్వితచర్వణమొనర్చుట తృప్తికరముగా నుండలేదనియు స్వభావసిద్ధమై గతకాలపు సమస్తాధ్యాత్మిక ప్రయత్నముయొక్క నిగూఢఫలితమైయున్నప్పటికిని ఇంతవఱకు సిద్ధింపని దానిని ఇంతవఱకు దృగ్గోచరముకానిదానిని సాధించుట కొకవిషయము నుపపాదించుచున్నాననియు దెలియజెప్పుటకు కొందఱుసాధకుల కొక యుత్తరమందు అది నవీనమని నొక్కిచెప్పియుంటిని.

క్రింద బేర్కొను ఈ కారణములవలన పురాతనయోగములతో బోల్చిచూచినపు డిది క్రొత్తదిగా నున్నది:—

## ఆఱవ తరంగము

౧. ఈయోగము ప్రపంచమునుండి జీవితమునుండి స్వర్గమునకో నిర్వాణమునకో పలాయనమగుటగాక జీవితముయొక్క ఉనికియొక్క మార్పునే కాంక్షించుచున్నది. ఆమార్పు ఏదో యప్రధానము ప్రాసంగికముగాక విలక్షణము ముఖ్యోద్దేశ్యము నై యున్నది. ఇతరయోగములం దవరోహణ మున్నను అది మార్గమందొక ప్రాసంగికముగా ముందుగా ననుకొనని యొక సంభవముగా నారోహణముయొక్క ఫలముగామాత్ర మయియున్నది; నిజముగా నారోహణమే ముఖ్యము. ఇచ్చట ఈ యోగమందు ఆరోహణము ప్రథమసోపానమే, అది యవరోహణమునకు మార్గమే. ఆరోహణమున లభించు నవ్యప్రజ్ఞయొక్క యవరోహణమే ఈసాధనయొక్క ప్రత్యేకధర్మము, విశిష్టలక్షణము. తాంత్రికవైష్ణవ సాధనలుగూడ జీవితమునుండి విమోచనముగాంచుటయందే యంతమగుచున్నవి. జీవితముయొక్క దివ్యత్వపరిపూర్తియే ఇందు లక్ష్యముగా నున్నది.

౨. వ్యక్తికొఱకీశ్వరసాక్షాత్కారము నొక వ్యక్తి సాధించుటగా దీయోగమున గాంక్షించు లక్ష్యము. ఏదో విశ్వాతీతమైన సిద్ధికిగాక ఇచ్చట, ఈ విశ్వమందు, భౌమికచైతన్యమునకు లభింపజేయుటకే. సాధించవలసిన విషయముగూడ నింతవఱకాధ్యాత్మిక జీవితమందు సహితము నిర్మాణముకానట్టియు భూలోకమున — పృథ్వీ స్వభావమందు — ప్రత్యక్షముగా క్రియారూపముదాల్చినట్టియు నొక చైతన్యశక్తిని — విజ్ఞానశక్తిని — తీసికొనివచ్చుటయే. దానినింకను నిర్మాణమొనర్చి ప్రత్యక్షముగా బనిచేయునట్లు చేయవలసి యున్నది.

3. తన ముందిడుకొనిన లక్ష్యమువలె సమగ్రము సర్వతోముఖమునైన ఈ కార్యసిద్ధికి యొకవిధానము స్పష్టీకరింపబడినది;

అనగా ప్రజ్ఞయొక్క స్వభావముయొక్క సంపూర్ణమైన సమగ్రమైనమార్పు. పురాతన పద్ధతులను గ్రహించినను, అవి ప్రత్యేకమైన వేఱుమార్గములకు కొంతపాక్షిక ప్రయోజనముగా తాత్కాలిక సాహాయ్యముగా మాత్రముండును. పురాతనయోగములలో నీమార్గము నట్లే పూర్ణముగాగాని దానితో బాటుగాగాని వ్యవహరించినట్లు లేక స్వానుభవమునకు దెచ్చినట్లు నేను జూచియుండ లేదు. నా కది లభించియుండియున్నచో ముందుగా అంధకారమునుండి కాంతివంతముగావించి, సిద్ధపఱచి, దిద్దితీర్చి, ప్రతిష్ఠించి, నిరపాయముగా ప్రకాశము – బహిరంగము – గా గావింపబడినటువంటి ఆమార్గముల ననుసరించి నే నతిత్వరితగతి సుఖముగా నాగమ్యస్థానమునకు పరుగిడ గలిగియుండినపుడు తిరిగి నేను బాటలనిర్మించుటయందు ముప్పది సంవత్సరములుగా తదన్వేషణమందు, అంతస్సృష్టియందు నాకాలము వ్యర్థపుచ్చియుండరాదు.

ఇంకను శ్రీ అరవింద యోగమును ఆయోగ సాధనవిధానమును సమగ్రముగా గ్రహించుటకు వారు రచించిన యోగసంయోజనము (The synthesis of yoga), 'తల్లి' (The Mother), యోగదీపికలు (Lights on yoga), యోగపునాదులు(Bases of yoga) మున్నగు గ్రంథముల బఠించనగును. కాని యోగము నందఱు, ఎవరంతట వారు వారిష్టముననుసరించి యభ్యసింప గలిగినంత సులభవిషయము గాదు. అపూర్వము మహత్తరము నగు శ్రీవారి పూర్ణయోగము మఱింత

కష్టతమము. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని గీతలో నుడివినట్లు సంపూర్ణ సమర్పణ మొనర్పవలయును; అచంచల విశ్వాసము, అనన్యభక్తి యుదయించ వలయును; అంతఃస్థితముగా నిందుల కాహ్వాన ముండవలయును. మఱియు సద్గురుసాన్నిధ్యము వారియనుగ్రహము లభించవలయును. 'గురు వనగా నొక యున్నతతర ఆత్మస్థితికి చైతన్యమునకు నారోహించిన వారు. సాధారణముగా వారిని సాక్షాదీశ్వరావిర్భావముగా లేక ఈశ్వర ప్రతినిధిగా భావించెదరు. వారు తమ యుపదేశములవలన నంతకంటె నెక్కువగా తమ ప్రభావాదర్శములవలనమాత్రమే గాక స్వానుభవము నితరులకు సంక్రమింపజేయునట్టి యొక శక్తిమూలమునను సాయపడుచుందురు'. ఇట్టివారి జీవితచరితమును మము బోంట్లు సొంతముగా నెట్లు వ్రాయగలరు? శ్రీ అరవింద జీవితము అగాధజలధింబోలె యనంతము. ఆ తరంగము లంత మొందవు. శ్రీ అరవింద వాఙ్మయమును బఠించి యందలి యనంతజ్ఞానమును యథాశక్తి గ్రహించి భూలోకమున దివ్యతజీవనము దివ్యానందము ననుభవింప ప్రయత్నింతముగాక. ఇక పాఠకమహాశయుల సెలవు

గైకొని శ్రీఅరవింద పాదారవిందములకు భక్తిమెయి ప్రణమిల్లి యింతటితో విరమించుచున్నారము.

శ్రీ కృష్ణార్పణమస్తు.

---

# అనుబంధము

## జాతీయత *

మన విద్యార్థులు దాదాపుగ నూరువత్సరములనుండి పాశ్చాత్య భావమునకు దాసులైరి. అందువలన ఆర్యవిజ్ఞానమును, ఆర్యభావమును గోల్పోయి శక్తివిహీనులుగను, పరాశ్రయులుగను, అనుకరణప్రియులుగను మారిపోయిరి. కాని తమోభావము నేడు నశింపుచున్నది. దీనికి కారణమును బాగుగ నరయవలయును, తగిన మీమాంస నొనర్పవలయును.

పదునెనిమిదవ శతాబ్దమందు తమోగుణజన్యమగు అజ్ఞానమును రజోగుణమువలన గలిగిన ప్రవృత్తియు భారతీయులను సంపూర్ణముగ నాక్రమించెను. అందువలన స్వార్థపరులును, కర్తవ్యపరాఙ్ముఖులును, దేశద్రోహులును, అసురస్వభావులగు శక్తియుతులును జన్మించి మాతృదేశమును పరాధీనతకు దగినదానినిగ నొనర్చిరి. ఆస్థితియందు భగవానుని నిగూఢప్రేరణను నెరవేర్చుటకుగాను ఐరోపాఖండ

* కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము. శ్రీ అరవిందులు ౧౯౧౦ వ సంవత్సరమునకు పూర్వము రాచకీయరంగమున నుండిన కాలములో రచించిన వ్యాసమున కనువాదము.

వాస్తవ్యులగు ఇంగ్లీషువర్తకులు పతితమైన భారతవర్షమందు ప్రవేశించి సునాయాసముగ జయించిరి. ఈ యత్యద్భుతవిషయమును దలంచి యాశ్చర్యాన్వితుడుగాని మానవుడు జగత్తునందు గానరాడు.

*　　　*　　　*

కాని యెవ్వరును దీనికి సరియగు మీమాంస నొనర్పజాలక ఇంగ్లీషువర్తకులయందుండు సుగుణములవలననే భారతవర్షము లభించినదని చెప్పువారిమాటలను మాటిమాటికి వేరొక్కనుచుందుము. ఇంగ్లీషువారియం దనేకసుగుణములు గలవు. లేనియెడల ఇంగ్లీషుజాతి పృథివియందు దిగ్విజయ మెట్లు పొందగలదు? భారతవర్షము ఇంగ్లీషువర్తకుల హస్తగతమగుటకు కారణము భారతీయుల నికృష్టతయు, ఇంగ్లీషువారి శ్రేష్ఠత్వమును, అని తలంచుట భ్రాంతియుతముగాదు. కాని సాధారణమానవు లీ విషయమందు మిక్కిలిభ్రాంతి నొందుదురు. కావున నీవిషయమును సూక్ష్మముగ నాలోచించి భ్రమవిరహితమగు మీమాంస యొనర్చుట యత్యంతావశ్యకము.

ఇంగ్లీషువర్తకులు భారతవర్షమును జయించిన విషయము చరిత్రయం దత్యద్భుతముగ గోచరించును, ఇంద్రజాలమువలె గన్పట్టును. ఏలనన, భారతీయు లసభ్యులా? దుర్బలులా? అజ్ఞానులా? అటులయినచో ఇంగ్లీషువర్తకుల విజయమున కాశ్చర్యపడ నక్కరలేదు. కాని భారతవర్షమున, రాజపుత్రులు, మహారాష్ట్రులు, శిక్కులు, పఠానులు, మొదలగు వీరజాతులు, కుశాగ్రబుద్ధులగు వంగీయులు, చింతాశీలురగుద్రావిడులు, రాజనీతికోవిదులగు మహారాష్ట్రబ్రాహ్మణులు అలరారుచుండిరి. ఇంగ్లీషువర్తకుల విజయకాలమందు నానాఫర్నవీసువంటి మేధావియు రాజనీతికోవిదుడును, మధోజిసింధియావంటి యుద్ధవిశారదుడును మహాసేనానియు, హైదరాలీ రణజిత్ సింహుల

వంటి ప్రతిభాశీలురును, నూతనరాజ్యనిర్మాతలును, భారతవర్షము నందు ప్రతిప్రాంత మం దలరారు చుండిరి. ఇందువలన పదునెనిమిదవ శతాబ్దమందు భారతీయులు తేజమం దేమి బుద్ధియం దేమి ప్రపంచ మం దేజాతికిని అణుమాత్రమైనను దీసిపోరని వ్యక్తమగుచున్నది. ఆ కాలమున భారతవర్షము సరస్వతీనికేతనమును, లక్ష్మీమందిరమును, జగచ్ఛక్తికి క్రీడాస్థానమును అయియుండెను. ఏదేశమును ప్రబలులును ప్రవర్ధనశీలురగు మహమ్మదీయు లత్యంత ప్రయాసతోడ వందలకొలది వత్సరములు జయించినను నిర్విఘ్నముగ శాసింపజాలకుండిరో ఆ మహాదేశము ఏ బదివత్సరములలో సునాయాసముగ ఇంగ్లీషు వర్తకుల యధీనమాయెను. సంపూర్ణముగ స్వప్రయత్నమును గోల్పోయెను. ఒక్క నూరువత్సరముల కాలము వారి యేకచ్ఛత్రముక్రింద మైమరచి నిద్రించెను.

కాని యేకత్వము లేకుండుటవలననే భారతవర్షమునకీ దుర్గతి సంభవించినదని కొందరనవచ్చును. అది యొక ముఖ్యకారణ మను మాట నిజమే. కాని భారతవర్షమునం దేకాలమందైనను ఏకత్వ మున్నదా? మహా భారతకాలమందుగాని, చంద్రగుప్త అశోకచక్ర వర్తుల కాలమందుగాని మహమ్మదీయుల కాలమందుగాని యేకత్వము గలదా? లేదు. అటులనే భారతవర్షమందు ఏకత్వము పదునెనిమిదవ శతాబ్దమందునను లేదు. కాబట్టి ఏకత్వము లేకుండుటచేత ఇంగ్లీషు వర్తకులకీ యత్యద్భుతవిజయము గలిగిన దని నుడువుటకు వీలులేదు.

* * * *

భారతీయులు సమస్తగుణములయందును ఇంగ్లీషువర్తకులను మించినవారైనను జాతీయభావ శూన్యులైయుండిరి. ఇంగ్లీషువారియం దీభావము పరిపూర్ణముగ వికసించెను. కాని యిట్లనుటవలన ఇంగ్లీషు

వారు స్వదేశప్రేమికులనియు స్వదేశ ప్రేమప్రేరణమువలన భారతవర్షమందు సామ్రాజ్యమును స్థాపింపగలిగిరనియు దలంపజనదు. ఏలనన స్వదేశప్రేమ జాతీయభావ మనునవి స్వతంత్రవృత్తులు. స్వదేశప్రేమ సర్వత్ర స్వదేశమును సందర్శింపుచుండును. స్వదేశమును ఇష్టదేవతగ భావించి తద్దేవతా పాదపద్మములయందు యజ్ఞరూపమున సమస్త కార్యముల నర్పించి దేశహిత మొనర్చుచుండును. దేశస్వార్థమునందు స్వ స్వార్థమును లోపింపజేసికొనును. పదునెనిమిదవ శతాబ్దమందలి ఇంగ్లండువర్తకుల కీ భావములేదు. ఈభావము జడవాదులగు పాశ్చాత్యుల ప్రాణమందు స్థిరరూపమును దాల్చుటకు వీలులేదు. కాబట్టి ఇంగ్లీషువర్తకులు స్వదేశహితముకొఱకు భారతవర్షమునకు రాలేదు. వర్తకముకొఱకు స్వార్థసిద్ధికొఱకును భారతవర్షమునకు వచ్చియుండిరి. కాన స్వదేశహితార్థము భారతవర్షమును జయించిరనుట కల్ల. స్వార్థసిద్ధికొఱకే భారతవర్షమును జయించిరి. కాని వారు స్వదేశప్రేమికులుగా కున్నను, జాతీయభావోపేతులైయుండిరి. "సమస్తదేశములయందును నాదేశము శ్రేష్ఠమైనది. నాజాతియొక్క ఆచార విచారములు, ధర్మము, నీతి, చరిత్ర, బలము, విక్రమము, బుద్ధి, మతము, కర్మ మొదలగునవి యసమానములు. ఇట్టివి మఱియొకజాతికి గలుగుట దుర్లభము. నాదేశహితమే నాహితము. నాదేశగౌరవమే నాగౌరము. నాదేశీయుల అభివృద్ధియందే నా అభివృద్ధియున్నది. కేవలము స్వ స్వార్థమును సంపాదించుకొనుటయేగాక దానితోడ నాదేశీయుల స్వార్థమునుగూడ నార్జింతును. స్వదేశగౌరవము మానాభివృద్ధికొఱకు యుద్ధ మొనర్చుట ప్రతివానికి కర్తవ్యము. అవసరమైనప్పుడు యుద్ధమందు నాహుతి యగుట వీరధర్మము" అను విశ్వాసము, అభిమానము కర్తవ్యబుద్ధి మొదలగునవి జాతీయభావమునకు ప్రధానలక్షణములు.

జాతీయభావము రాజసికభావము, స్వదేశప్రేమ సాత్త్వికభావము. తన 'అహమును' స్వదేశముయొక్క 'అహము'నందు విలీన మొనర్ప గలిగినవాడు ఆదర్శ స్వదేశప్రేమికుడు. తన 'అహము'ను సంపూర్ణముగ రక్షించుకొనుచు, దానితోడ దేశముయొక్క 'అహము'ను రక్షింపుచు దానిని వృద్ధిలోనికి దెచ్చువాడు జాతీయభావోపేతుడు. ఆ కాలమందలి భారతీయులు జాతీయభావశూన్యులై యుండిరి. ఇట్లనుట వలన వారు స్వజాతిహితముకొఱకు బ్రయత్నించి యెరుంగరని యెప్పుడును దలంపజనదు. కాని స్వహితము, జాతిహితమునకు అణుమాత్రము విరోధము గలిగినను గూడ జాతిహితమును వీడి స్వహితమును జూచుకొనుచుండిరి. ఏకత్వము లేకపోవుటకంటెను జాతీయభావము లేనందు వలన మహానర్థము సంభవించెను. పరిపూర్ణమగు జాతీయభావము దేశమందంతటను వ్యాపించినయెడల నానాభేదసంకులమగు భారతవర్షమందుగూడ ఏకత్వము సుసాధ్యమగును. కాని యేకత్వము గావలయునని యరచినమాత్రమున నది లభించునదికాదు. నాడు జాతీయభావమువలననే ఇంగ్లీషువర్తకులు భారతవర్షమును జయింపగలిగిరి.

అసురులకును, అసురులకును యుద్ధము ప్రారంభమాయెను. జాతీయభావోపేతులును ఏకత్వముగలిగినవారును అగు ఆంగ్లేయ అసురులు, జాతీయభావశూన్యులును ఏకత్వరహితులు నగు భారతీయ అసురులను జయించిరి. బలవంతుడు మల్లయుద్ధమందు జయమొందును. సత్వరగతియు, సహిష్ణుతగలవాడు పరుగుపందెమునందు జయ మొందును. కాని సచ్చరిత్రుడు, పుణ్యాత్ముడయిన మాత్రమున, మల్లయుద్ధమునందుగాని, పరుగుపందెమునందుగాని, జయము గాంచజాలడు. ఇది ఈశ్వరనియమము, కావున తగినశక్తి యుండవలెను.

అందువలననే జాతీయభావవికాసమువలన దుర్వృత్తులతో గూడినజాతి సామ్రాజ్యము స్థాపింపగలిగెను. జాతీయభావము లేకుండుటవలన, సచ్చరిత్రయుతమగు పుణ్యజాతి పరాధీనమున జిక్కి చివరకు చరిత్ర సుగుణములను గోల్పోయి యధఃపతిత మాయెను.

రాజనీతిద్వారమున పరికించినయెడల ఇదియే భారతవర్షము యొక్క పరాధీనతకు సరియగు మీమాంసగ గన్పట్టుచున్నది. ఇంకను నిందు గంభీరసత్యము నిహితమైయున్నది. తమోగుణసంభూత మగు అజ్ఞానమును, రాజసికగుణసంజాతమగు ప్రవృత్తియు, భారతవర్ష మందు ప్రబలముగ నుండెనని చెప్పియుంటిని. ఈ యవస్థ తమోన్ముఖావస్థ. రాజసికగుణసేవవలన రాజసికశక్తి వికసించును. కాని మిశ్రమరహితమగు రాజసికశక్తి యత్యంతశీఘ్రముగ తమోముఖ మగును. నియమవిహీనమగు రాజసికప్రయత్నము సత్వరగతిని బల హీనమై అప్రవృత్తి, శక్తిహీనత, విషాదము, నిశ్చేష్టగ బరిణ మించును. రాజసికశక్తి సత్త్వముఖమైనప్పుడు స్థిరమగును. సాత్త్విక భావములేనియెడల, సాత్త్వికాదర్శమైన నుండవలయును. ఆ యా దర్శమువలన రజోశక్తి నియమబద్ధమగును, సుస్థిరమున నలరారును. స్వాధీనత, నియమబద్ధముగ బ్రవర్తించుట యను మహత్తర సాత్త్వి కాదర్శములు రెండును ఇంగ్లీషువారియందు చిరకాలమునుండి యుండెను. అందువలననే ఇంగ్లీషువారు జగత్తునం దగ్రగణ్యులును, చిరవిజయులు నైయున్నారు. పందొమ్మిదవ శతాబ్దమందు పరోపకార ప్రవృత్తి ఇంగ్లీషువారియందు ప్రబలముగ బ్రకాశించెను. అందువలన నింగ్లండునందు జాతీయప్రభావము చరమావస్థను గాంచెను. పాశ్చాత్యులు జ్ఞానతృష్ణయొక్క ప్రబలప్రేరణమువలన వేలకొలది యావి ష్కారముల నొనర్చిరి. ఒక్కొక్కజ్ఞానకణముకొఱకు వందలకొలది

ప్రాణముల నర్పించిరి! బలవత్తరమగు నీ సాత్త్వికజ్ఞానదృష్టి ఇంగ్లీషు వారియందు పరిపూర్ణముగ వికసించియుండెను. ఇందువలన ఇంగ్లీషు వారు బలవంతులైరి, అజేయులైరి. కాని యీసాత్త్వికశక్తి క్షీణించిన కాలదిని ఇంగ్లీషువారి ప్రాధాన్యము, తేజము, శౌర్యము, క్రమముగ నశించి భయము, విషాదము, అవిశ్వాసము వృద్ధిగాజొచ్చెను. సాత్త్విక లక్ష్యభ్రష్టమగు రాజసికశక్తి తమోముఖ మయ్యెను.

భారతజాతి మహాసత్త్వగుణసంపన్నులకు నిలయము. సాత్త్విక బలయుతులగు భారతీయులు జ్ఞాన శౌర్య తేజములందు జగత్తునం దనుపమానులై యుండిరి. మఱియు వారియం దేకత్వము లేకుండినను వేయివత్సరములకాలము విదేశీయుల ఆక్రమణమునుండి భారతవర్షము నుద్ధరించి శత్రుదళ దమనులైరి. చివరకు సత్త్వము హ్రస్వముగా జొచ్చెను, రజస్సు వృద్ధినొందెను. జ్ఞానము సంకుచితమాయెను. అందు వలన రాజసికగుణప్రధానులగు రాజపుత్రులు భారత సింహాసనము నధిష్ఠించిరి. భారతవర్షమండలి యుత్తరభాగము యుద్ధములకును, అంతఃకలహములకును ఉనికిపట్టాయెను. వంగదేశమునందు బౌద్ధ ధర్మము క్షీణించుటతోడ, తమోభావము ప్రబలమయ్యెను. ఆధ్యా త్మికజ్ఞానము ద్రవిడదేశము నాశ్రయించెను. సత్త్వతేజమువలననే దక్షిణ భారతవర్ష మనేక వత్సరములవరకు స్వతంత్రమును రక్షించు కొన గలిగెను. జ్ఞానతృష్ణయు జ్ఞానోన్నతియు క్రమక్రమముగ నశిం చెను. దాని స్థానమందు పాండిత్యప్రభావము, అభిమానము, గౌరవ ములు ప్రవేశించెను. ఆధ్యాత్మిక జ్ఞానము, యోగశక్తివికాసము, అంత రంగికోపలబ్ధి యుండవలసిన ప్రదేశమందు తామసికపూజయు, స కామ రాజసిక వ్రతోద్యాపనములును, అలరార జొచ్చెను. వర్ణాశ్రమ ధర్మము విలుప్త మాయెను. మానవులు బాహ్యాచార విచారముల

నత్యధికగౌరవముగ జూడజొచ్చిరి. ఇటులనే జాతిధర్మము లోపించుట వలన గ్రీసు, రోము, ఈజిప్టు, ఆసియా మొదలగు దేశములు మృత్యు గహ్వరమున బడెను. కాని యప్పటప్పుడు భారతీయుల సనాతనఝరి నుండి సజీవమగు యమృతధారలు ప్రవహించి యార్యజాతియొక్క ప్రాణమును రక్షణజేయుచుండెను. శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ చైతన్యప్రభువు, నానక, కబీరు, రామదాసు, వేమనయోగి మొదలగు వారమృతవర్షమును గురిపించి మరణావశిష్టమైయున్న భారతజాతియందు ప్రాణసంచార మొనర్చిరి. ఆ యమృత మత్యుత్తమ మైనదైనను తమోగుణమునందును రాజసికగుణ ప్రవాహములయందును దగుల్కొనుటవలన, అధమాధమముగ బరిణమించెను. సాధారణమానవులు శ్రీ శంకరునివేదాంతముతో తమోభావమును సమర్థింపజొచ్చిరి. చైతన్యుని ప్రేమధర్మము ఘోరతర తమోభావమునకు నిలయ మాయెను. రామదాసస్వామియొక్క సుశిక్షవలన దక్షులైనమహారాష్ట్రులు, మహారాష్ట్రధర్మమును మరచి స్వార్థసాధనమందును, అంతఃకలహములయందును స్వశక్తిని దుర్వినియోగ మొనర్చుకొని, శివాజీ మహారాజు బాలాజీరావులచే స్థాపింపబడిన మహారాష్ట్ర సామ్రాజ్యమును వినాశ మొనర్చిరి. పదునెనిమిదవ శతాబ్దమందీప్రవాహముయొక్క తీవ్రవేగము భారతవర్షమం దంతటను గన్పడుచుండెను. సంఘాధిపత్యము, ధర్మము, మొదలగునవి కొంతమంది సామాన్యజనులచే జిక్కెను. బాహ్యాచారములు, క్రియాకలాపములతో గూడిన యాడంబరములు ధర్మముగ బరిగణింపబడుచుండెను. ఆర్య జ్ఞానము విలుప్తమయ్యెను. ఆర్యచరిత్ర నశించెను. సనాతనధర్మము జనసంఘమునుండి వీడి సన్న్యాసుల యరణ్యవాసమందును, భక్తుల హృదయమందును దాగుకొనెను. భారతవర్ష మప్పుడు ఘోరతర

తమోభావమునందు మునిగెను. ప్రచండమగు రాజసిక ప్రవృత్తి ఆర్య ధర్మావరణయందు వికసించి స్వార్థము, పాపము, దేశద్రోహము, అపకారము మొదలగు కార్యములను జేయించుచుండెను.

కాని యిప్పుడు భారతవర్షమునందు శక్తి లోపించెనని తలంప జనదు. ఐనను ఆర్యధర్మము, సత్త్వగుణము లోపించుటవలన ఆశక్తి యాత్మరక్షణము జేసికొనజాలక యాత్మవినాశనమునకు దోడ్పడెను. మఱియు నాశక్తి ఇంగ్లీషువారి యసురశక్తిసమ్ముఖమున పరాజితమై నియమవిహీనమై మృత్యువువాత బడెను. అప్పటినుండియు భారత వర్షము పరిపూర్ణతమోభావమునందు నిద్రింపుచున్నది. అప్రకాశము, అప్రవృత్తి, అజ్ఞానము, అకర్మణ్యత, ఆత్మవిశ్వాసాభావము, ఆత్మసన్మాన విసర్జనము, దాసత్వప్రియత్వము, అప్రియధర్మసేవ, పరానుకరణము, పరాశ్రయము, మందాత్మోన్నతి, అప్రయత్నము, విషాదము, ఆత్మనింద, క్షుద్రాశయము, అలసత మొదలగునవి తమోభావమువలన గలుగు గుణములు. ఈ గుణములన్నియు పందొమ్మిదవ శతాబ్దమందు భారతవర్షమందెట జూచినను తాండవమాడుచుండెను. కావుననే యా శతాబ్దమందలి సర్వప్రయత్నములు తమోగుణ చిహ్నములు. ఆ చిహ్నములు లేని ప్రదేశము భారతవర్షమునందు వెదకినను గాన రాదని నుడువుట యాశ్చర్యముకాదు.

భగవదనుగ్రహమువలన భారతవర్షము నేడు తిరిగి మేల్కొనినది. జాగరణయొక్క ప్రథమ ముహూర్తమందు, జాజ్వల్యమానమగు జాతీయ భావనోద్దీపనాశక్తి జాతియందు, ప్రతి రక్తబిందువునందును, అత్యంత తీవ్రముగ బ్రవహింపజొచ్చెను. దానితోడ స్వదేశ ప్రేమతో గూడిన యున్మాదకరమగు ఆ వేగము యువకబృందము నాశ్రయించెను. మఱియు వారియందు "మనము పాశ్చాత్యులము

గాము, ఆసియాఖండవాసులము, భారతీయులము, ఆర్యులము" అను జాతీయభావము శతముఖముల వెలుంగజొచ్చెను. కాని దీనియందు స్వదేశప్రేమ దృఢముగ నాటుకొననియెడల జాతీయభావము పరిస్ఫుటము గాదు. ఈ స్వదేశప్రేమకు మూలమంత్రము మాతృపూజ. శ్రీ బంకించంద్రుడు సందర్శించిన "వందేమాతరం" అను మహామంత్రము బాహ్యేంద్రియముల నతిక్రమించి ప్రాణమునందవతరించెను. అప్పటినుండియు మనహృదయమందు స్వదేశప్రేమ వికసించెను. మాతృమూర్తి ప్రతిష్ఠింపబడెను. "స్వదేశమే తల్లి, స్వదేశమే భగవానుడు" అనువేదాంత శిక్షాంతర్గతమగు మహత్తరశిక్ష జాతీయాభ్యుదయమునకు బీజమయ్యెను. జీవుడు భగవానుని అంశము. జీవునిశక్తి భగవచ్ఛక్తియొక్క యంశము. ఇదేవిధముగ త్రింశత్కోటి భారతీయుల సమష్టియు, సర్వవ్యాపియగు వాసుదేవుని యంశము-ఈత్రింశత్కోటి నాశ్రయించియున్న శక్తిస్వరూపిణియు, బహుభుజాన్వితయు, బాహుబలధారిణియు నగు భారతజననిని భగవానుని శక్తియై, మాతా, దేవీ, జననీ, కాళీరూపమున విరాజిల్లుచున్నది. భారతజాతి మనఃప్రాణములయం దీమాతృప్రేమను, మాతృమూర్తిని, జాగరికత మొనర్చి ప్రతిష్ఠింప వలయును. అందుకొఱకే భగవానుడు కొలదికాలమునుండి మనదేశమం దుత్తేజనము, ఉద్యమము, కోలాహలము, అవమానము, నిర్యాతన మొదలగువానిని గలిగించియున్నాడు. కాని ఈకార్యము పూర్తియైనది. ఇక ముందు చేయవలసిన దేమి?

ఆర్యజాతియొక్క సనాతనశక్తిని పునరుద్ధరింపవలయును. ప్రథమమున ఆర్యశిక్షయు, ద్వితీయమున యోగశిక్షయొక్క పునర్వికాసమును, తృతీయమున ఆర్యోచితజ్ఞాన తృష్ణగలిగి కర్మద్వారమున నవయుగమున కావశ్యకమగు సామగ్రిని సమకూర్పవలయును.

కొలది వత్సరములనుండి యున్న యుత్సాదకరమగు యుత్తేజమును నియమబద్ధముగను స్థిరలక్ష్యాభిముఖముగ నొనర్చుకొని, మాతృకార్యో ద్ధరణ కుపయోగింపవలయును.

ఈ మహాకార్యము నిర్వహింపదలచినయెడల శక్తి నార్జింపవల యును. కాని కేవల ముత్తేజనమువలన కార్యసిద్ధి కాదు. శక్తి కావల యును. మనపూర్వులు ఘటనాఘటన పటీయసీ మహాశక్తి నాశ్ర యించిరి. ఆశక్తి నుపలబ్ధి నొందిరి. ఆశక్తి నేడు తిరిగి యువకమండలి యం దవతరించుటకు ప్రయత్నించుచున్నది.

యువకులారా! ఆమహాశక్తియే తల్లి. తల్లి పాదపద్మములయం దాత్మసమర్పణజేయుడు. అప్పుడు మీరు ధన్యులగుదురు. మీ వంశము, జాతి, దేశము, మానవమండలి, ధన్యము లగును. మాతృశక్తి మిమ్ము యంత్రములుగ జేసికొని సత్వరగతిని కార్యసిద్ధి నొనర్చును. దానిని గాంచి జగత్తంతయు స్తంభిత మగును. ఆశక్తి మీకు లభింపకుండుట వలననే మీ ప్రయత్నము లన్నియు విఫలము లగుచున్నవి. మాతృశక్తి మీహృదయసింహాసనముమీద విరాజిల్లుచున్నది. మీరు మాతృపూజను, మాతృసేవను, జేయుట నేర్చుకొని యున్నారు. కావున మీరిప్పుడు అంతర్నిహితయగు జగజ్జననికి ఆత్మసమర్పణజేయుడు! ఇంతకంటె కార్యోద్ధరణకు మరి వేరుమార్గము లేదు!



# అ ర్ప ణ ము

## బ్రహ్మశ్రీ వేలూరి చంద్రశేఖరంగారు

కాంచి ధన్యుండ నైతి నగాధ జలధి,
నైతి ధన్యుడఁ జూచి యనంత గగన;
మహాహా! యరవింద! నీదు పాదారవింద
యుగళి వీక్షించి పరమ ధన్యుండ నైతి!

అరిది యతిథివి, నేలపై నవతరించి
నాఁడ వే జ్యోతిబింబము పీడి నీవు;
తమము నిండిన యీ నేలతల్లి యెడఁద
వెలుఁగు పూరముతోడఁ బ్లావితము సేయు!

హృదయమా! యేమి గీతి నర్పింతు విట్టి
యరిది యతిథికి? నేమి జోహారువు పలుకు
లో రసన! నీవు పలుకంగ నేరు? తో స్వ
రంబ! యే ఛంద మూఁడ గానంబు సేతు?

ప్రణతి మౌనము — గీతి, నిష్పంద శాంతి —
వృత్త, మింక లోని జ్యోతి—సాహిత్య మగుత!
రూపు గైకొన్న యీ జ్యోతి మ్రోల నిలువ
నదియె యనురూప మైనట్టి యర్పణంబు.

---

# శ్రీ అరవిందకృత గ్రంథములు

౧. నేడు లభించగల గ్రంథములు *

| | | |
|---|---|---|
| ౧. | Baji Prabhu | ౦-౧౦-౦ |
| ౨. | Essays on the Gita (In two Volumes) | ౧౨-౮-౦ |
| ౩. | Evolution | ౦-౮-౦ |
| ౪. | Ideal and Progress | ౧-౦-౦ |
| ౫. | Isha Upanishad | ౧-౮-౦ |
| ౬. | Kalidasa | ౧-౦-౦ |
| ౭. | Lights on Yoga | ౧-౪-౦ |
| ౮. | Love and death | ౧-౪-౦ |
| ౯. | National Education | ౧-౦-౦ |
| ౧౦. | Rishi Bankim Chandra | ౦-౬-౦ |
| ౧౧. | Six Poems | ౧-౪-౦ |
| ౧౨. | Songs to Myrtilla | ౧-౪-౦ |
| ౧౩. | Sri Aurobindo's teachings and his Ashram | ౦-౧౦-౦ |
| ౧౪. | The Brain of India | ౦-౬-౦ |

* ఈ గ్రంథము లన్నియు పుదుచ్చేరిలోను ప్రసిద్ధిగాంచిన గ్రంథవిక్రయ సంస్థలలోను దొరకును.

| | | |
|---|---|---|
| ౧౫. | The Century of Life | ౧-౧౪-౦ |
| ౧౬. | The Ideal of the Karmayogin | ౧-౧౨-౦ |
| ౧౭. | The Mother * | ౧-౦-౦ |
| ౧౮. | The National value of Art | ౦-౮-౦ |
| ౧౯. | The Renaissance in India | ౧-౧౨-౦ |
| ౨౦. | The Riddle of this world | ౨-౦-౦ |
| ౨౧. | The Superman | ౦-౬-౦ |
| ౨౨. | Yoga and its objects * | ౦-౧౨-౦ |
| ౨౩. | Thoughts and Glimpses | ౦-౮-౦ |
| ౨౪. | Uttarapara Speech * ౧ | ౦-౪-౦ |
| ౨౫. | War and Self-determination | ౨-౦-౦ |
| ౨౬. | Bases of yoga | ౩-౦-౦ |

౨. ముద్రణమున నున్న గ్రంథములు, నేడు లభించని గ్రంథములు:—

౧. Ahana

౨. A System of National Education

౩. Dayananda and the Veda

౪. Dayananda, the man and his works.

౫. Hero and the Nymph ౬. Man—Slave or Free?

౭. Urvasie ౮. Speeches of Sri Aurobindo.

---

* ఈగుర్తు గల గ్రంథము లాంధ్రమునను అనువదింపబడి యున్నవి. * ౧ ఈ గ్రంథము నందే ఆంధ్రానువాదము గలదు.

## శ్రీ అరవిందకృత గ్రంథములు

3. ఆర్యపత్రికలో ప్రకటింపబడి ఇంకను గ్రంథరూపమున వెలువడనివి:—

౧. A Defence of Indian Culture

౨. Karma and Rebirth

3. Katha Upanishad (only text and translation)

౪. Kena Upanishad

౫. The Future Poetry

౬. The Ideal of Human Unity

౭. The Life Divine *

౮. The Miscellany

౯. The Psychology of Social Development

౧౦. The Secret of the Veda

౧౧. The Synthesis of yoga *౧.



---

* ఈ గ్రంథమందలి సారసంగ్రహమే శ్రీ అరవింద దర్శన మనుపేర ఆంధ్రీకృతమై ప్రకటింపబడి యున్నది.

*౧. ఆంధ్రానువాద మొనర్పబడినది:

# సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౮ | ౨౧ | నాబదమె | నాబద్ధమై |
| ౪౦ | ౯ | బ్రపాదించెనో | బ్రసాదించెనో |
| ౪౨ | ౨౦ | సమానముని | సమూహామని |
| ౫౯ | ౨౦ | స్వరాజ్య | స్వారాజ్య |
| ౬౨ | ౧ | సుంజెంచి | సుటించి |
| ౮౮ | ౧౬ | గుర్తించి | గుర్తించు |
| ,, | ౨౪ | యున్ననాయున్నత | యున్నదాయున్నతి |
| ౯౭ | ౯ | ప్రాపించెచను | ప్రాపించెదను |
| ౧౦౦ | ౧౪ | నిదిమో. | నిదిరే. |
| ౧౧౧ | ౫ | మాకు | మీకు |
| ౧౪౭ | ౯ | భవిష్యద్జ్ఞాన | భవిష్యజ్ఞాన |
| ౧౪౯ | ౧౦ | ఆశీయా | ఆశియా |
| ,, | ౧౪ | తదోపకరణ | తదుపకరణ |
| ౧౫౦ | ౧౦ | పాశ్చాత్యనుకరణ | పాశ్చాత్యానుకరణ |
| ,, | ౧౮ | అత్యుచ్ఛ | అత్యుచ్చ |
| ౧౫౪ | ౩ | సత్యాన్వేమణ | సత్యాన్వేషణ |
| ౧౫౭ | ౩ | కాఠిన్యాంశ | కఠినాంశ |
| ,, | ౧౬ | కావశ్యమేర్పడినది | కావశ్యకత యేర్పడినది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౬౦ | ౧౫ | యోచనా | ఆలోచనా |
| ౧౬౧ | ౧౫ | వారిలేఖలను | వారి యాంగ్ల లేఖలను |
| ౧౬౨ | ౧౦ | జీవనారహస్యము | జీవనరహస్యము |
| ౧౬౬ | ౬ | నదృశ్యులై | పరోక్షులై |
| ,, | ౧౨ | మించినిదనియు | మించినదనియు |
| ౧౬౮ | ౧౩ | సమష్ఠి | సమష్టి |
| ౧౮౧ | ౧౦ | దారాపుత్రాది | దార పుత్రాది |
| ౧౮౨ | ౨ | కేరళ మలయాళీల | కర్నాట కేరళుల |
| ౧౮౪ | ౧౫ | సాధకీ | సాధికా |
| ౧౮౬ | ౧౮ | మినహాయింపు గావించి | అరుదుగా మినహాయింపు గావించు చుండినందున |
| ౧౯౫ | ౨౦ | నిర్ధిష్ఠ | నిర్దిష్ట |
| ౧౯౬ | ౧౭ | Overcmental | Overmental |
| ౧౯౯ | ౧౬ | devine | divine |
| ౨౦౮ | ౧౨ | రపస్సు | తపస్సు |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B118 |
| పుస్తకం పేరు | శ్రీఅరవింద జీవితము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 249 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8,20,2A,50,104,130A,160A,164,168A |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |

BLANKS=170A,174A,210,212,218